Photo by Ravinder Kumar Paul




బహుమతి
పొందిన వ్యాఖ్య

తురంగముపై స్వారి

పంపినవారు :
పి. శేషగిరిరావు - గుంటూరు

మనోహరమైన పరిమళమునకు!






మాలిని

రెమి సౌందర్య పరికరాలు

Aykan

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక :
చిత్రకథ, ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.



## మీ పతిభక్తికి తార్కాణము



కష్టపడి పనిచేసి, 'ఎంతోదూరము ప్రయాణముచేసి అలసిపోయి యింటికి వచ్చిన మీ ఆయనకు సేదదేర్చండి. ఒక కప్పు టీతో అరు కరకరలాడే పచ్చని గోధుమ రంగు గ్లూకో బిస్కట్లను యిస్తే ఆయన ఆనందము పొందుతారు. ఆయన విషయములో మీరు తగు జాగ్రత తీసుకోండి. రుచికరమైనవనే కాకుండా, అలసట నిరుత్సాహములను పోగొట్టి శక్తిని చేకూర్చే పార్లెవారి గ్లూకో బిస్కట్లను ఆయనకు పెట్టండి.

జ్ఞాపకముంచుకోండి: శక్తిని పొందుటకు ఆయనకు ప్రతి రోజు ఆరు పార్లెవారి గ్లూకో బిస్కట్లను పెట్టండి.




# పార్లేవారి
# గ్లూకో
# బిస్కట్లు

విటమినులు చేర్చబడినవి

పార్లె ప్రోడక్ట్సు మ్యానుఫ్యాక్చరింగ్ కంపెని ప్రైవేట్ లిమిటెడ్., బొంబాయి.24

EVEREST PG.59-28. TL



మే విడుదల!
విశ్వరూపా
కూతురుకాపురం
నిర్మాత + దర్శకుడు
శేషగిరిరావు + శోభన్‌రావు

మనోహరమైన
ముఖలావణ్యమునకు











సినిమా తార
లందరకు నచ్చినది

ది నేషనల్ ట్రేడింగ్ కంపెని, బొంబాయి-2 * మదరాసు-1

---

అద్వితీయమైన నాణ్యము! అతి సరసమైన మూల్యము !!

FOR *Costly* PENS

*Iris*

INKS







ఐరిస్
సిరాలు

ఫౌంటెన్ కలములకు పేరెన్నిక కన్నవి.

1, 2, 4, 12, 24 ఔన్సుల ప్యాకింగులలో లభించును.

తయారుచేయువారు:

రీసెర్చి కెమికల్ లెబొరేటరీస్

మద్రాసు-4 ★ న్యూఢిల్లీ-1 ★ బెంగళూరు-3





# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

జీవితంలో మనిషికి కావలిసినదేమిటి? చాలా మంది సుఖాలు, భోగభాగ్యాలు, గొప్పపదవులు కోరుతారు. కాని మనిషికి నిజంగా కావలిసినది మనశ్శాంతీ, ఆనందమూనూ. వీటికి సౌఖ్యాలతో గాని, సిరిసంపదలతోగాని, హోదాతోగాని ఏమీ సంబంధం ఉండదు. ఈ విషయాన్ని నిరూపించే కథలు ఈ సంచికలో రెండున్నాయి.

ఒకటి షేక్స్పియర్ నాటక కథ "రాజద్రోహం." ఇందులో మాక్‌బెత్ అనేవాడు రాజును చంపి తానే రాజవుతాడు. ఈ హత్యను కప్పిపుచ్చటానికి ఇంకా అనేక హత్యలుచేసి, ఆనందం అనుభవించకుండానే చనిపోతాడు.

రెండో కథ "అమూల్యమైన ఆస్తి." ఇందులో ఒక గొల్లవాడు ఆస్థానంలో పెద్ద ఉద్యోగం సంపాదించికూడా తన నిజమైన ఆనందం హోదాలో లేదని గుర్తించగలుగుతాడు.

సంపుటి 24 : మే 1959 : సంచిక 5






భీష్ముడి తండ్రి శంతనమహారాజు. ప్రతీప మహారాజుకు దేవాపి, శంతనుడు, బాహ్లికుడు అని ముగ్గురు కుమారులుండేవారు. ప్రతీపుడు రాజ్యం విడిచిపెట్టి వనవాసానికి వెళ్లాడు. న్యాయంగా దేవాపి రాజు కావలసింది. కాని దేవాపి రాజ్యం చేయక తాను కూడా వనాలకు వెళ్లిపోయి పాషండులతో చేరిపోయాడు. అందుచేత ప్రతీపుడి రాజ్యానికి శంతనుడే రాజయాడు.

ఒకనాడు శంతనుడు గంగాతీరాన విహరిస్తుండగా గంగ మానవస్త్రీ రూపంలో కనిపించింది. శంతనుడామెను తనకు భార్యకమ్మని కోరాడు. "నేను ఏంచేసినా సహించి ఊరుకోవాలే గాని నిష్ఠురాలు అడరాదు. అలా ఉండేపక్షంలో నేను నిన్ను పెళ్లాడతాను," అని గంగ అన్నది.

గంగ పెట్టిన ఈ నియమానికి శంతనుడు సమ్మతించాడు.

కాలక్రమాన గంగకు శంతనుడి వల్ల ఏడుగురు కొడుకులు పుట్టారు. గంగ ఒక్కొక్కరినే పుట్టగానే తీసుకుపోయి నీటిలో పడవేసి చంపింది. ఇది చూసి శంతనుడు చాలా బాధపడ్డాడు కాని, ఆమెను విమర్శించే అధికారం లేనందువల్ల మాట్లాడక ఊరుకున్నాడు.

గంగ ఎనిమిదవ పిల్లవాణ్ణికూడా కని చంపటానికి సిద్ధపడింది. శంతనుడు ఇక సహించలేక గంగను నానా మాటలూ అన్నాడు. గంగ ఆ పిల్లవాణ్ణి శంతనుడికి ఇస్తూ, "రాజా, మన మధ్య జరిగిన ఒప్పందాన్ని ఉల్లంఘించి నన్ను తిట్టావు గనక ఇక నేను నీకు భార్యనుకాను. ఇక నేనీ పిల్లలను ఎందుకు చంపానో చెబుతాను విను. ఒకప్పుడు అష్టవసువులు వసిష్ఠుడి కామధేనువును దొంగిలించటానికి ప్రయత్నించారు. వారిని ఈ దొంగతనానికి పురికొల్పి

అట్టమీది బొమ్మ



నది ప్రభాసుడనే వసువు భార్య. తన గోవును తస్కరించ యత్నించినందుకు వసిష్ఠుడు మానవజన్మ ఎత్తమని శపించాడు. ప్రభాసుణ్ణిమటుకు మానవుడుగా చిరకాలం జీవించమని శపించాడు. ఆ ఎనిమిదిమందీ కోరి నా గర్భాన జన్మించారు. ఏడుగురికి పుట్టగానే జన్మవిమోచన కలిగించాను కాని, వీడు ప్రభాసుడు ; వీడు చిరకాలం జీవించి వసువులతో చేరుకుంటాడు!" అన్నది. తరవాత ఆమె శంతనుణ్ణి వదిలి తన దారిన తాను వెళ్లిపోయింది.

గంగకూ శంతనుడికీ పుట్టిన ఎనిమిదవ కుమారుడే భీష్ముడు.

కొంతకాలం గడిచింది. శంతనుడు యమునాతీరాన వేటాడుతూ ఉండగా ఆయనకు దాశరాజు కూతురు సత్యవతి కనిపించింది.

శంతనుడు ఆమె అందానికి పరవశుడై ఆమెను తన భార్యగా చేసుకోవాలనే ఉద్దేశంతో దాశరాజు వద్దకు వెళ్లాడు.

"రాజా, సత్యవతిని నువు వివాహమాడటం నాకు సమ్మతమే. కాని ఆమెకు పుట్టే కొడుకు నీ తరవాత రాజుకావాలి. ఒప్పుకుంటే మీవివాహం ఇప్పుడే చేస్తాను," అన్నాడు దాశరాజు.



ఇది శంతనుడికి సమ్మతం కాలేదు. తన పెద్దకొడుకు భీష్ముడుండగా పుట్టబోయే కొడుకులకు రాజ్యం ఇస్తాననటం ఇష్టంలేక శంతనుడు విచారంతో ఇంటికి వచ్చాడు. భీష్ముడు తన తండ్రి విచారానికి కారణం తెలుసుకుని, దాశరాజు వద్దకు వెళ్లి, "మీ కుమార్తెను నా తండ్రికివ్వండి. నేను రాజ్యం కోరను. నా కొడుకులు రాజ్యం కోసం తగాదాపెడతారని భయపడతారేమో, నేను అజన్మబ్రహ్మచారిగా ఉండిపోతాను," అని ప్రతిజ్ఞ చేశాడు. ఇదే భీష్మప్రతిజ్ఞ.

శంతనుడికీ సత్యవతికీ వివాహం జరిగింది. వారికి చిత్రాంగదుడూ, విచిత్ర





వీర్యుడూ అని ఇద్దరు కుమారులు కలిగారు. శంతనమహారాజు చాలాకాలం రాజ్యంచేసి చనిపోయాడు. అప్పుడు భీష్ముడు తన ప్రతిజ్ఞప్రకారం పెద్దవాడైన చిత్రాంగదుడికి రాజ్యాభిషేకం చేసి, విచిత్రవీర్యుణ్ణి యువరాజు చేశాడు.

కొద్దికాలానికి చిత్రాంగదుడు చనిపోయాడు. అప్పుడు భీష్ముడు సత్యవతి అనుమతితో విచిత్రవీర్యుడికి రాజ్యాభిషేకం చేసి, తాను అతనికి అండగాఉంటూ రాజ్యపాలన చేయించాడు.

విచిత్రవీర్యుడికి యుక్తవయసు వచ్చింది. అతనికి తగిన పిల్లనుతెచ్చి వివాహం చేయాలని భీష్ముడు సంకల్పించాడు. ఆ సమయంలో కాశీరాజు తన కుమార్తెలైన అంబ, అంబిక, అంబాలికల స్వయంవరం ప్రకటించి, నానా దేశాల రాజులకు ఆహ్వానాలు పంపాడు.

ఈ సంగతి తెలిసి భీష్ముడు రథమెక్కి ఒంటరిగా కాశీకి ప్రయాణమై వెళ్లాడు. అందగత్తెలని ప్రసిద్ధికెక్కిన ఆ కాశీరాజు కుమార్తెలను ఎలాగైనా తెచ్చి తన తమ్ముడైన విచిత్రవీర్యుడికి పెళ్లిచేయాలని ఆయన ఉద్దేశం. భీష్ముడు కాశీరాజు సభలో ప్రవేశించి అంబనూ, అంబికనూ, అంబాలికనూ చూశాడు. వారిని పెళ్లాడగోరి వచ్చిన రాజులందరినీ చూశాడు.

తన కుమార్తెలు వీర్యశుల్కలు అని కాశీరాజు ప్రకటించి ఉన్నాడు. అంటే వారి కోసం వచ్చినవారిలో యుద్ధం జరిగేపక్షంలో ఆ యుద్ధంలో గెలిచినవారు ఆ కన్యలను పెళ్లాడవచ్చు. అందుచేత భీష్ముడు అందరూ చూస్తుండగానే ఆ ముగ్గురు కన్యలనూ తెచ్చి తన రథంలో పెట్టి, స్వయంవరానికి వచ్చిన రాజులతో, "రాజులారా! నేను శంతనమహారాజు కుమారుడను, భీష్ముణ్ణి. మిమ్మల్నందరినీ ధిక్కరించి నేనీ కాశీరాజు కూతుళ్లను తీసుకుపోతున్నాను.



శక్తిగలవారైతే వీరిని విడిపించుకొనండి!" అని ఎలుగెత్తి చెప్పాడు.

ఆ రాజులు మండిపడ్డారు. వారు తమ తమ భటులకు ఆజ్ఞలిచ్చి రథాలనూ, ఏనుగులనూ, గుర్రాలనూ తెప్పించుకుని వాటిపైన ఎక్కి భీష్ముడితో యుద్ధానికి వచ్చారు. వారందరూ తనను అన్నివైపులా చుట్టుముట్టినప్పటికీ భీష్ముడు తన బాణాలతోనూ, అస్త్రాలతోనూ అందరితోనూ ఒకేసారి పోట్లాడి, అందరినీ ఓడగొట్టాడు. ఆయన ధాటికి నిలవలేక రాజులందరూ పారిపోయారు.



భీష్ముడు కాశీరాజు కుమార్తెలను తీసుకుని సత్యవతి దగ్గిరికి తిరిగి వచ్చి, "తల్లీ, వీరు కాశీరాజు కూతుళ్లు అనేకమంది రాజులతో పోరాడి గెలిచి ఈ కన్యలను నా తమ్ముడైన విచిత్రవీర్యుడికి భార్యలుగా తెచ్చాను," అన్నాడు. సత్యవతి ఆనంద పరవశురాలై, "నాయనా, ఎప్పుడూ ఇలాగే విజయాలు సాధించు!" అని భీష్ముణ్ణి ఆశీర్వదించింది.

విచిత్రవీర్యుడి వివాహానికి ఏర్పాట్లు జరుగుతూ ఉండగా కాశీరాజు పెద్దకూతురైన అంబ భీష్ముడితో, సిగ్గుపడుతూ ఇలా చెప్పింది: "భీష్మా, నేను ఇదివరకే సాళ్వ రాజును నా భర్తగా వరించి ఉన్నాను. ఆయనకూడా నన్ను ప్రేమించాడు. ఈ సంగతి నా తండ్రికి తెలియదు. నీవు ధర్మం ఎరిగినవాడవు. ఒకరికి మనసిచ్చిన నేను మరొకరిని ఎలా పెళ్లాడగలను? సాళ్వ రాజు నాకోసం చూస్తూ బాధపడుతుంటాడు. అందుచేత నన్ను ఆయన వద్దకు పంపు!"

ఈసంగతి తెలియగానే భీష్ముడు సత్యవతితోనూ, మంత్రి పురోహితులతోనూ సంప్రతించి అంబను సాళ్వరాజు వద్దకు పంపే ఏర్పాట్లు చేశాడు. వృద్ధులైన బ్రాహ్మణులనూ, దాసీజనాన్నీ వెంటబెట్టుకుని అంబ సాళ్వరాజువద్దకు వెళ్లింది. ఆమె





సాళ్వరాజుతో, "నేను నీకోసమై వచ్చాను. నిన్నుతప్ప నేను మరొకరిని పెళ్లాడలేను. అందుచేత నా కోరిక తీర్చు," అన్నది.

సాళ్వరాజు ఈమాటలు విని వెకిలినవ్వు నవ్వి, "అంబా, నువు ఎప్పుడో భీష్ముడికి భార్యవయావు. నేను నిన్ను పెళ్లాడను. భీష్ముడి వద్దకే తిరిగి వెళ్లు. మరొకడికి భార్యవైన నిన్ను పెళ్లాడి నేను నారాజ్యంలో ధర్మాన్ని ఏవిధంగా అమలు చేయగలుగుతాను?" అన్నాడు.

అంబ సాళ్వరాజుతో, "రాజా, నిజం తెలియకుండా ఇలాటి మాటలనకు. నేను ఇష్టపడి భీష్ముడి వెంట వెళ్లలేదు. భీష్ముడు కూడా నన్ను పెళ్లాడే ఉద్దేశంతో తీసుకుపోలేదు. ఆయనకు బ్రహ్మచర్య వ్రతమున్నది. మా ముగ్గురు అప్పచెల్లెళ్లనూ తన తమ్ముడికిచ్చి పెళ్లిచేసే ఉద్దేశంతో తీసుకువచ్చాడు. నేను నిన్ను ప్రేమిస్తున్నానని తెలిశాక ఆయన ఈ పరివారమంతా వెంట ఇచ్చి నన్ను ఇక్కడకి పంపాడు. నా చెల్లెళ్లు మాత్రమే విచిత్రవీర్యుణ్ణి పెళ్లాడారు. ఇందులో నావల్లజరిగిన అధర్మం ఏమున్నది. రాజా, నేను నిన్నుతప్ప మరొకరిని భర్తగా భావించలేదని ప్రమాణం చేస్తాను. నన్ను నిరాకరించకు!" అని బహువిధాల వేడుకున్నది.

కాని సాళ్వరాజు మనసు మారలేదు. ఆయన అంబతో, "అమ్మాయీ, నన్నెందుకు వేధిస్తావు? నీ యిష్టంవచ్చిన చోటికి వెళ్లిపో. మమ్మల్నందర్నీ చెండాడి భీష్ముడు నిన్ను తన సొత్తు చేసుకున్నాడు. భీష్ముణ్ణి తలుచుకుంటేనే నా శరీరం గజగజలాడుతున్నది. నేను నిన్ను పరిగ్రహించలేను!" అన్నాడు.

అంబ భోరుమని ఏడుస్తూ సాళ్వనగరం నుంచి బయలుదేరింది. ఆమె తన దుస్థితిని బాగా అర్థంచేసుకున్నది. ఆమె తన తండ్రికీ, భీష్ముడికీ, సాళ్వుడికీ కూడా కాకుండా పోయింది. ఇంతా జరిగినాక ఆమె హస్తినా



పురానికి వెళ్ళటంలో అర్థంఉండదు. వెళ్ళినా భీష్ముడామెను ఆదరించబోడు. ఆమెకు అందరూ అన్యాయమే చేశారు. ఆమె తండ్రి ఆమె మనసు తెలుసుకోక వీర్యశుల్కగా ప్రకటించాడు. భీష్ముడు ఆమె మనసు తెలుసుకోక ఆమెను తన రథంలో హస్తినాపురానికి తీసుకుపోయాడు. ఉన్న సంగతంతా చెప్పినాకూడా చివరకు సాళ్వరాజు ఆమెను నిరాకరించాడు. మిగిలిన వాళ్ళతోబాటు అంబ తనకుతానే ద్రోహం చేసుకున్నది; రథంలో ఎక్కించుకునేటప్పుడే భీష్ముడితో ఆమె సాళ్వరాజుగురించి చెప్పిఉంటే, భీష్ముడామెను తప్పక వదిలిపెట్టి ఉండేవాడు, సాళ్వరాజు స్వీకరించీ ఉండేవాడు.

తన జీవితం భగ్నంకావటానికి ఇంత మంది కారకులైనప్పటికీ అంబ కోపం భీష్ముడిమీద కేంద్రీకరించుకున్నది. ఆమె సాళ్వనగరం దాటి అరణ్యాలలో ఉండే ముని ఆశ్రమాలకు వెళ్ళి ఆ రాత్రి అక్కడే పడుకున్నది. అక్కడి మునులంతా అంబ చెప్పిన విషాదగాథ విన్నారు.

అక్కడి మునులకందరికీ శైఖావత్యుడనే వృద్ధ ముని ఆచార్యుడు. ఆయన అంబతో, "అమ్మా, ఇక్కడ మేమంతా



తపస్సు చేసుకునేవాళ్లం. నీకు కలిగిన కష్టాలు తొలగించటానికి మేము చేయగలది ఏమున్నది?" అన్నాడు.

అంబ చేతులురెండూ ఎత్తి నమస్కారం చేసి, "స్వామీ, మీదయ నాకుచాలు. మీరు నాకు తపస్సుచేసే విధానం తెలిపినట్టయితే కఠోరతపస్సు చెయ్య నిశ్చయించాను. కిందటి జన్మలో చేసుకున్న పాపంచేత నాకు ఎక్కడా నిలవ నీడలేకుండా చేసుకున్నాను. నాకు వేరే జీవితాశకూడా లేదు. అందుచేత మీతోబాటు నేనుకూడా ఇక్కడే వుండి తపస్సుచేసుకునే అవకాశం ఇవ్వండి," అన్నది.





అంబను చూసి ఆశ్రమవాసులందరూ జాలిపడ్డారు. వారిలోవారు ఆమె సమస్య గురించి చర్చించుకున్నారు. కొందరు ఆమెను తండ్రి వద్దకు పంపటం మంచి దన్నారు; మరికొందరు ఆమె దీనస్థితికి భీష్ముడే కారకుడన్నారు; ఇంకా కొందరు ఆమెను ఎలాగైనా సాళ్వరాజుదగ్గిరికి పంప టమే ఉత్తమమన్నారు.

చివరకు అందరూ కలిసి అంబతో, "అమ్మా, నీవు నీ తండ్రి ఇంటికి వెళ్లటమే అన్నివిధాలా శ్రేయస్కరం. ఆడది తండ్రి ఇంటనైనా ఉండాలి, భర్తఇంటనైనా ఉండాలి, మూడోచోట ఉండటం ముప్పు. నీ తండ్రి ఇంట నీకు సుఖం లేకపోవచ్చు, కాని ఇక్కడ తపస్సు చేసేదానికన్న అది ఎంతో మేలు. నీలాటి సుకుమారి అయిన రాజకన్య తపస్సు చేయాలంటే సాధ్య మయే పని కాదు. అదీకాక, ఈ ఆశ్ర మంలో నీవంటి సుందరి ఉన్నదని తెలిస్తే ఎక్కడెక్కడి రాజులూ నిన్ను ఎత్తుకు పోవటానికి వస్తారు. అందువల్ల చాలా ఉప ద్రవాలు కలుగుతాయి. కనుక నీవు ఇంటికి వెళ్లటం మంచిది," అన్నారు.

అంబ అందరికీ నమస్కారం చేసి, "మహామునులారా, నేను నా తండ్రి ఇంట ఒకప్పుడు ఎంతో గౌరవంగా బతికాను. అక్కడే తిరిగి అగౌరవంగా బతకటం నాకు ఎంతమాత్రమూ ఇష్టంలేదు. నేను కాశీకి తిరిగివెళ్లి నా తండ్రికి మొహం చూపించ లేను. అందుచేత మీ అందరి చాటునా ఉండి ఈ అరణ్యంలోనే నేనుకూడా తపస్సు చేసుకుంటాను. తపస్సుచేత పర లోకంలోనైనా నాకింత సుఖం దొరక వచ్చును. ఇప్పుడు నాకుకలిగిన కష్టాల లాటివి ఏ లోకంలోకూడా సంభవించకుండా ఉండటమే నా కోరిక. అందుచేత దయ చేసి నాకు తపోవ్రతం ఉపదేశించండి!" అని ప్రార్థించింది.






## 11

[గండభేరుండపక్షి రెక్కలలో దాగివున్న చంద్రవర్మ, పట్టుతప్పి సరస్సులో పడిపోయాడు. తరవాత అక్కడ మొసళ్ల బారినుంచి తప్పుకుని, సరస్సు ఒడ్డునే వున్న తోటలోకి చేరాడు. ఒక రాత్రివేళ, మాంత్రికుడైన శంఖుడు వున్న కొండ ఎక్కబోతున్న చంద్రవర్మకు, కొండ దిగువ వున్న రాళ్లగుట్టల్లో మాంత్రికురాలైన కాపాలిని కనిపించింది. తరవాత—]

రెండు కొండరాళ్ల నడుమ మూలుగుతూ, నీరసంగా పడివున్న కాపాలినిని చూస్తూనే, చంద్రవర్మ నివ్వెరపోయాడు. అగ్నిపక్షి, గండభేరుండ పక్షులతో మాట్లాడిన సంగతి వెంటనే అతడికి గుర్తుకొచ్చింది. కాపాలిని గండభేరుండ పక్షులకు చిక్కి, వాటివల్ల ఈ శంఖుడి కొండప్రాంతానికి తేబడిందని అతడు గ్రహించాడు.

" కాపాలినీ, నీకు ప్రాణాపాయం కలిగించే దెబ్బలేమీ తగులలేదుకదా? ఆ గండభేరుండపక్షు లెక్కడ?" అని అడిగాడు చంద్రవర్మ ఆదుర్దాగా.

కాపాలిని చిన్నగొంతుతో, "వర్మా! అంత పెద్దగా మాట్లాడకు. మనం యీ చాపుల వున్న ఏదైనా గుహ చేరటం మంచిది. అక్కడ అన్ని విషయాలూ చెపుతాను. నాకు ప్రాణాపాయమేమీ లేదు. కొంచెం చేయి సాయం యిస్తే లేచి నడవగలను," అన్నది.

చంద్రవర్మ, కాపాలిని పక్కన వంగి కుడిచేతితో ఆమె భుజం పట్టుకుని, ఆమె




లేచి నిలబడేందుకు సాయపడ్డాడు. తర వాత కాపాలిని చంద్రవర్మ చేతిని ఆసరాగా పట్టుకుని నడుస్తూ, "వర్మా! ఆ వెదురు పొదల చాటున ఏదో గుహలా కనిపిస్తున్నది. అక్కడికి వెళదాం పద," అన్నది.

చంద్రవర్మా, కాపాలినీ చిన్న చిన్న రాళ్లను ఎక్కి దిగుతూ కొద్దిసేపటికల్లా, కొండపాదంలో వున్న ఒక చీకటి గుహను చేరారు. ఆ గుహద్వారం చాలా యిరుకైనది. దానిని అన్నివైపులా కప్పుతూ వెదురు పొదలూ, అడవిమొక్కలూ దట్టంగా పెరిగి వున్నవి. గుహ లోపలమాత్రం విశాలంగా వున్నది. గుహ పైభాగంలో వున్న రాతి పగుళ్లనుంచి సన్నని గుడ్డివెలుగు అక్కడా యిక్కడా ప్రసరిస్తున్నది.

కాపాలిని గుహకు ఒక మూలగా చేరగిల బడి కూర్చోగానే, చంద్రవర్మ ఆమెతో, "కాపాలినీ! నువ్వు యీ కొండప్రాంతాలకు తేబడినట్టు మాంత్రికుడైన శంఖుడికి తెలుసా?" అని అడిగాడు.

కాపాలిని చిరునవ్వు నవ్వింది. ఆమెలో ప్రాణభీతి ఏ కోశానా వున్నట్టు లేదు.

"వర్మా! నేను యీ కొండప్రాంతాన వున్నట్టు తెలిస్తే, శంఖుడు నన్నీసరికే హతమార్చి వుండేవాడు. నేను నిన్న తెల్ల వారు జామునుంచి, యీ రాళ్లగుట్టల మధ్య పడివున్నాను. హఠాత్తుగా మీద పడి నన్ను పట్టుకున్న గండభేరుండ పక్షులు రెండూ, కాలనాగుకు చిక్కి దుర్మరణం పాలయినై," అన్నది కాపాలిని.

"అలా అయితే యిక మనం భయపడ వలసిన పనిలేదు. నేను యీ చీకటిమాటున శంఖుడి మంత్రగృహం సంగతేమిటో తేల్చు కుంటాను," అంటూ చంద్రవర్మ లేచాడు.

కాపాలిని చంద్రవర్మను వారిస్తూ, "వర్మా, ఆ అగ్నిపక్షి సంగతి మరిచిపోకు. రాత్రివేళ మనం భయపడవలసింది ఆ అగ్నిపక్షిని గురించి; పగటివేళ శంఖుడి



నుంచి ప్రమాదం శంకించవచ్చు. ఈ రాత్రితో అగ్నిపక్షి బెడద వదిలితే తప్ప, మనకు క్షేమం లేదు. దాని అంతు తెలుసుకునేందుకు కాలనాగు ప్రయత్నిస్తున్నది," అన్నది.

"కాలనాగు యిక్కడికి వచ్చిందా?" అన్నాడు చంద్రవర్మ ఆశ్చర్యంగా.

చంద్రవర్మ మాటలకు కాపాలిని నవ్వింది. "వర్మా! కాలనాగుకు నామీద కన్న నీమీద భక్తివిశ్వాసాలు ఎక్కువని తెలుసుకున్నాను. హఠాత్తుగా నువ్విక్కడ కనిపించినప్పుడు నేనేమీ ఆశ్చర్యపడలేదు. ఇంత త్వరలో యిక్కడికి ఎలా చేరావని కూడా నిన్నడగలేదు. దానికి కారణం: కాలనాగు నీగురించి సర్వం నాకు చెప్పింది. అడవిలోని వింతవృక్షాన్నుంచి పండు కోసుకుతిన్నావని తెలుసుకున్నప్పుడే, నీవు క్షేమంగా యిక్కడికి చేరగలవని నేను భావించాను," అన్నది కాపాలిని.

కాపాలిని మాట ముగించీ ముగించక ముందే, పెద్దగా మెరిసినట్టయి ఆ ప్రాంత మంతా వెలుగుతో నిండిపోయింది. చంద్ర వర్మ ఆశ్చర్యపడుతూ గుహద్వారం దగ్గిరకు వచ్చి బయటికి తొంగిచూశాడు. సమీపంలో వున్న వెదురుపొదల వెనకభాగంలో అగ్ని పక్షి కనిపించింది. ఆ వెంటనే కోరలు




సాచిన కాలనాగు దానిమీదికి లంఘించటం అతడి కంట బడింది.

"కాపాలినీ! అగ్నిపక్షిమీద కాలనాగు కలియబడుతున్నది. నేను వెళ్లి కాలనాగుకు సహాయంచేస్తాను," అన్నాడు చంద్రవర్మ.

"వద్దు వర్మా, వద్దు!" అంటూ కాపా లిని వున్నచోటునుంచి గుహముఖద్వారం దగ్గిరకు వచ్చి బయటికి చూస్తూ, "అ శంఖుడి భృత్యుణ్ణి కాలనాగు హతమార్చ గలదని నాకు విశ్వాసం వున్నది. అలా కానినాడు నీకూ, నాకూకూడా అతణ్ణుంచి ప్రమాదం తప్పదు. గండభేరుండ పక్షులు నన్ను యీ కొండప్రాంతాలకు తెచ్చినవని





మంటలు కాలనాగు శరీరానికి ఉడుకు లెత్తిస్తున్నవి. కాలనాగు నోటినుంచి విడిచే విషవాయువుల తాకిడికి అగ్నిపక్షి కళ్లు తేలవేసి అటూ యిటూ పడిలేస్తూ, తిరిగి పోరాటానికి తలపడుతున్నది.

"ఈ అలజడి శంఖుడి చెవులబడితే, మనం అతడి చేతిలో చిక్కిపోయినట్టే," అన్నాడు చంద్రవర్మ.

"అలాజరిగే అవకాశంలేదు. తన భృత్యుడైన అగ్నిపక్షి రాత్రివేళ కాపలా కాస్తూండగా, తన కెలాంటి ప్రమాదమూ వాటిల్లదని శంఖుడి నమ్మకం. ఆ కారణంవల్ల అతడు చీకటిపడగానే నిద్రకు వుపక్రమిస్తాడు. తిరిగి సూర్యోదయానికి కొంచెం ముందుగా మాత్రమే అతడు నిద్రనుంచి మేల్కొనటం జరుగుతుంది. అతడి అలవాట్లన్నీ నాకు తెలియనివి కావు," అన్నది కాపాలిని.

ఇంతలో అగ్నిపక్షి పెద్దగా అరవబోయి కీచుమంటూ శబ్దంచేసి తల వేలాడవేసింది. తన మూడు తలలతో కాలనాగు దాని గొంతు బిగించి, అది తల వేలాడవేయగానే, తన పట్టువదిలి పక్కకువాలింది.

"జై, కాలనాగూ....వీరనాగూ!" అంటూ చప్పట్లు చరచబోయి, అంతలోనే నాలుక కొరుక్కొని, అమితోత్సాహంగా చంద్రవర్మ

అగ్నిపక్షి పసికట్టివుంటుంది. ఆ సంగతి అది తన యజమానితో చెప్పకముందే దాన్ని తుదముట్టించటం క్షేమం," అన్నది.

ఈలోపల అగ్నిపక్షీ, కాలనాగూ ఒకళ్ల నొకళ్లు హతమార్చుకునేందుకు చేసే పోరాటం మహా భయంకరంగా వున్నది. అగ్నిపక్షి తన వాడిముక్కుతో కాలనాగు మూడు తలలను చిన్నాభిన్నం చేసేందుకు ప్రయత్నిస్తున్నది. అగ్నిపక్షి వాడిగోళ్లనుంచి చురున జారుతూ, దాని పట్టునుంచి బయట పడగానే, తన కోరలతో అగ్నిపక్షి కంఠాన్ని కాటువేసేందుకు కాలనాగు ప్రయత్నిస్తున్నది. అగ్నిపక్షి శరీరం నుంచి వెలువడే



గుహనుంచి బయటికి దూకాడు. కాపాలిని కూడా ఎక్కడలేని ఓపికా తెచ్చుకుని, చంద్రవర్మతోపాటు బయటికి నడిచింది.

చంద్రవర్మ, కాపాలినీ తనను సమీపించే సరికి కాలనాగు సొమ్మసిల్లి నేలను కరుచుకు పడుకునివున్నది. ఆ యిద్దరూ దగ్గిరకు రావటం చూస్తూనే అది చప్పున తన తలలను పైకెత్తి గౌరవసూచకంగా ఆడించింది.

చంద్రవర్మ, కాలనాగును సమీపించి ఆప్యాయంగా దాని శరీరాన్ని నిమిరాడు. అగ్నిపక్షి రెక్కలనుంచి వెలువడే మంటలకు కాలనాగు శరీరం నల్లగా కాలి, కొన్నిచోట్ల చర్మం వూడిపోయింది. తన సేవకుడి దుస్థితి చూస్తూనే కాపాలిని నివ్వెరపోయి, ప్రేమగా దాని తలలను తాకుతూ, "కాలనాగూ! ఈనాటితో నీ బాధలు తీరిపోయినై. శంఖుడి మంత్రగృహం నుంచి అపూర్వశక్తులు గల శంఖాన్ని చేజిక్కించుకోగానే, నీకు మానవ రూపం ప్రసాదిస్తాను. ఆ తరవాత నీయిష్టం వచ్చిన చోటుకు వెళ్లవచ్చు," అన్నది.

శంఖుడి మంత్రగృహం పేరు వింటూనే చంద్రవర్మ అదిరిపడ్డాడు. అతడు దృష్టిని తూర్పుదిక్కుకేసి సారించి, "కాపాలినీ, సూర్యోదయానికి అట్టే వేళ లేనట్టున్నది. యిక నేను ఆ మాంత్రికుడి పూజామందిరం సంగతేమిటో చూస్తాను," అన్నాడు.





కాపాలినికూడా తూర్పుదిక్కుకేసి ఓ క్షణకాలం చూసి, "వర్మా ! నీవు యీవేళలో అతడి మంత్రగృహానికి వెళ్లటం క్షేమం కాదు. అతణ్ణి తుదముట్టించటానికి నేనొక ఉపాయం ఆలోచించాను," అన్నది.

"ఏమిటది ?" అన్నాడు చంద్రవర్మ.

"శంఖుడు ప్రతిరోజూ సూర్యోదయం వేళ, తూర్పుదిక్కున వున్న కొండ అంచు మీదికి వెళ్లి, అక్కడ వున్న ఒక రాయిమీద నిలబడి గిర్రున అన్ని దిక్కులకూ తిరుగుతూ మంత్రోచ్చారణ చేస్తాడు. ఆ రాయి అడుగు వెడల్పూ, అడుగుఎత్తూ మాత్రం వుంటుంది. ఆ రాతికి ఆవల దాదాపు వెయ్యి అడుగుల



లోతుగల పెద్ద అగాధం వున్నది. నేను చెప్పినట్టు చేయగలిగితే, శంఖుణ్ణి ఆ రాతి మీదినుంచి, కిందవున్న అగాధంలోకి తోసి అతడి శరీరం అక్కడవున్న కరకు రాళ్లమీద పడి ముక్కలూ చెక్కలూ అయేట్టు చేయవచ్చు," అన్నది కాపాలిని.

"ఏమిటా ఉపాయం కాపాలినీ ?" అని అడిగాడు చంద్రవర్మ వుత్సాహంగా.

"అదేమిటో చెపుతాను, దగ్గిరకు రా !" అంటూ కాపాలిని, చంద్రవర్మ దగ్గిరకు రాగానే అతడి చెవిలో రహస్యం ఏదో చెప్పి, "ఇది ఎంతో గోప్యంగా నెరవేర్చవలసిన కార్యం. ఏమాత్రం పొరబాటు జరిగినా, సర్వనాశనం తప్పదు," అన్నది.

చంద్రవర్మ ఓ తృటికాలం ఆలోచిస్తూ నిలబడి, తరవాత దాపులవున్న ఒక ఎత్తయిన చెట్టు ఎక్కి తూర్పుదిక్కుకేసి కొంచెంసేపు పరీక్షించి చూసి దిగివచ్చి, కాపాలినితో, "కాపాలినీ! సూర్యోదయానికి మరెంతో కాలం లేదు. నా పనిమీద నేనుంటాను. నువ్వూ, కాలనాగూ ఆ గుహలో విశ్రాంతి తీసుకోండి," అంటూ చరచర ఒరలోనుంచి కత్తి దూసి, చెట్ల గుంపుల్లోకి వెళ్లాడు.

చూస్తూండగానే చంద్రవర్మ కత్తి వేటులకు చెట్ల ఊడలు ఒకదానివెంట ఒకటి







తెగి, గుట్టలు గుట్టలుగా కిందపడసాగినై. ఆ ఊడ లన్నిటినీ ఒకచోట చేర్చి, వాటిని ఒక దాని కొకటి ముడివేసి కొద్ది సేపటిలోనే చాలా పొడవైన మోకులా తయారుచేశాడు చంద్రవర్మ. అలా తయారైన మోకుకొసను భుజాన వేసుకుని చకచకా కొండ ఎక్కి, దాని తూర్పువైపు అంచున వున్న అడుగు చదరం గల రాతికి దానిని ముడివేశాడు. మాంత్రికుడైన శంఖుడు ప్రతిరోజూ సూర్యోదయానికి కొంచెం ముందుగా ఆ రాతిమీదనే నిలబడి, అన్ని దిక్కులకూ తిరుగుతూ మంత్రోచ్చారణ చేస్తాడు.

తన పని ముగియగానే చంద్రవర్మ కొండ దిగి కాపాలిని వున్న గుహదగ్గిరకు వచ్చాడు. అతణ్ణి గుహముందు చూస్తూనే కాపాలిని బయటికి వచ్చి, "వర్మా! పని విజయవంతంగా నెరవేర్చావా?" అని అడిగింది.

"అప్పుడే విజయం సంగతి ఎలా చెప్పగలను? ఊడ ఒక చివరికొసను ఆ రాతికి బిగించాను. రెండవ కొస కొండ దిగువ వున్నది. కాని, నన్నొక సందేహం బాధిస్తున్నది. మనం ఆ రాతిని తూర్పు దిక్కుకు గుంజినప్పుడుగదా, అది శంఖుణ్ణి అగాధంలోకి యీడ్చి ముక్కలు ముక్కలు చేసేది?" అని అడిగాడు.

"అదా నీ అనుమానం!" అంటూ కాపాలిని చిరునవ్వు నవ్వి, "సరే, శంఖుడు ఆ రాతిమీదకు ఎక్కగానే నువ్వు గుంజవలసిన ఊడకొస ఎక్కడున్నదో నాకు చూపించు. నీ అనుమానాలన్నీ నివారణ చేస్తాను," అన్నది.

చంద్రవర్మ, కాపాలిని వెంటరాగా కొండ పార్శ్వానికి వెళ్ళి, అక్కడ వున్న ఊడకొసను ఆమెకు చూపించాడు. కాపాలిని దానిని తాకి, తరవాత తూర్పువైపున వున్న కొండ అంచు కేసి చూస్తూ, "వర్మా! శంఖుడు మంత్రోచ్చారణ చేసేందుకు ఎక్కి నిలబడే ఆ రాతిని ఏమాత్రం పక్కకు కదిలించినా, అది

కొండ అంచుమీద వున్నది గనక, తప్పని సరిగా ఆ దిగువ గల అగాధంలోకే పడి పోతుంది. ఆ విషయంలో ఎలాంటి అను మానానికీ ఆస్కారంలేదు," అంటూ హఠాత్తుగా కళ్లు పెద్దవి చేసి, చంద్రవర్మకేసి తల వంచి, "అడుగో శంఖుడు! చేతిలో తళతళ మెరిసే మంత్రదండం కనబడు తున్నదా? అతడు రాయిమీదికి ఎక్కి నిల బడీ నిలబడటంతోనే, నువ్వు ఊడను లాగాలి," అన్నది కంఠస్వరం తగ్గించి.

చంద్రవర్మ కొండపైకి చూశాడు. అప్పుడే తెలతెల్ల నవుతున్న తూర్పుదిక్కు లేత వెలుగులో మాంత్రికుడైన శంఖుడి వికృతాకారం అతడికి కనిపించింది. ఒక్క క్షణకాలం చంద్రవర్మ నిలువెల్లా వణికి పోయి, అంతలోనే గుండె నిబ్బరం తెచ్చు కుని, ఊడకొసను రెండు చేతులతోటీ గట్టిగా పట్టుకున్నాడు. అంతలో శంఖుడు కొండ అంచున వున్న రాతిని సమీపించి దానిమీదికి ఎక్కి నిలబడి, మంత్రదండాన్ని ఉదయి స్తున్న సూర్యుడికేసి ఎత్తాడు.

"వర్మా, యిదే మంచి సమయం. ఊడను ఒక్కసారి గుంజి, చప్పున వదిలి పెట్టు," అన్నది కాపాలిని ఆత్రుతగా.

చంద్రవర్మ తన చేతులలో వున్న ఊడను బలంగా ఒకసారి గుంజి తక్కున వది లేశాడు. ఆ తక్షణం శంఖుడు చేతులు రెంటినీ పైకెత్తి వూపుతూ, కాళ్లతో గాలిని మధిస్తూ, "మోసం! ద్రోహం!" అంటూ భీకరంగా అరిచాడు. అతడి చేతిలో వున్న మంత్రదండం మెరుపులా పోయి, మంత్ర గృహాన్ని తాకింది. మంత్రగృహం వున్న దున్నట్టు పునాదులతోకూడా గాలిలోకి లేచి, పెద్ద ధ్వనిచేస్తూ సరస్సుమధ్యన పడి పోయింది. ఈలోపల శంఖుడు కొండదిగువ నున్న అగాధంలోని బండరాళ్లమీద తల కిందులుగా పడిపోయాడు.

—(ఇంకా వుంది)



# కులభ్రష్టుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు వెళ్ళి, శవాన్ని దించి భుజాన వేసుకుని, మరొకమారు శ్మశానంకేసి మౌనంగా నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదల అద్భుతమైనది. కాని ఎంత కార్యదీక్ష గలవారుకూడా తీరని అపజయం కలిగే సందర్భంలో పశ్చాత్తాప పడటం జరుగుతుంది. ఇందుకు ఉదాహరణగా నీకు ప్రతాపవర్మ కథ చెబుతాను విను!" అంటూ ఈ విధంగా చెప్పాడు:

పూర్వం ఉదయగిరి ప్రాంతంలో ప్రతాపవర్మ అనే రాజవంశపు యువకుడు ఉండేవాడు. ఆ కాలంలో ఉదయగిరి రాజ్యం సుభిక్షంగా ఉండేది కాదు. దేశమంతా పర్వతమయం కావటంచేత వ్యవసాయం చాలా తక్కువ. అక్కడి కొండలపై జీవించే ప్రజలు చాలా బీదవాళ్లు, కాని అపారమైన ధైర్యసాహసాలూ, ధర్మబుద్ధీ కలవారు.

బేతాళ కథలు



ఈ పేద ప్రజలతోబాటు కొద్దిమంది సంపన్నులుకూడా ఉండేవారు.

ప్రతాపవర్మ తండ్రి పూర్వాచారపరాయణుడు, కులాభిమానం హెచ్చుగా కలవాడు. ప్రతాపుడు ఆయనకు రెండవ కుమారుడు. ఆయన పెద్ద కుమారుడు రెండు మూడేళ్లపాటు దేశసంచారం చేసి రావటానికి వెళ్లాడు; అతనికి హేమ అని ఐదేళ్ల కుమార్తె ఉండేది.

ప్రతాపుడి తండ్రి ఇంట అనేకమంది బానిసలుండేవారు. వారంతా కొండజాతి వారే. ఆ బానిసలలో ఒక స్త్రీని ప్రతాపుడు ప్రేమించాడు. ఆమెను పెళ్లాడే ఉద్దేశంతో ప్రతాపుడు తండ్రి అనుమతి కోరాడు. తండ్రి ఈమాట విని మండిపడ్డాడు. "నువు కొండజాతిదాన్ని పెళ్లాడి నాకు కోడలుగా తీసుకు రావటానికి నేను ఎంతమాత్రమూ ఒప్పను. అలాటి కులహీనమైన పనిచేస్తే నిన్ను బహిష్కరిస్తాను!" అన్నాడాయన.

ఎన్నడూ తండ్రితో గట్టిగా మాట్లాడని ప్రతాపుడు ఈసారి ఆయనతో పోట్లాడి ఇంటి నుంచి వెళ్లిపోయి, తాను ప్రేమించిన స్త్రీని పెళ్లాడి కొండలలో వసించసాగాడు.

"వీడు ఈనాటినుంచీ నా కొడుకు కాడు. వీడు ఇక్కడికి వస్తే పరాయివాడల్లే చూడండి," అని ప్రతాపుడి తండ్రి తన ఇంటి నౌకర్లకు ఉత్తరువిచ్చాడు.

కొండజాతిదాన్ని చేసుకున్న ప్రతాపుడు ఏమాత్రమూ సుఖపడలేదు. రాచరికంలో పుట్టిపెరిగిన అతనికి కొండజాతివాళ్ల జీవితం జీవించటం చాలా కష్టమయింది. అతని ఆచారాలు వేరు, అతని భార్య ఆచారాలు వేరు. ఆమె ఇప్పుడు తనవారి మధ్య ఉంటున్న కారణంచేత ప్రతాపుడి ఆచారాలనూ, మర్యాదలనూ అవహేళనగా చూడసాగింది. ఈ జీవితం నుంచి తప్పించుకునేటందుకుగాను ప్రతాపుడు సైన్యంలో యోధుడుగా చేరాడు.

ఉదయగిరిపైకి పరిసరరాజు ఒకడు దండెత్తి వచ్చాడు. యుద్ధం జరిగింది. ఉదయగిరి సైన్యాలతోబాటు కొండముఠాలు కూడా పోరాడాయి. కాని యుద్ధంలో ఉదయగిరి ఓడిపోయింది. ఉదయగిరిలో ఉండే సంపన్నులందరూ ఓటమి ఒప్పుకుని కొత్తరాజుకు లొంగిపోయారు.

కొండజాతులవాళ్లు మటుకు లొంగిపోలేదు. వాళ్లు స్వాతంత్ర్యం ప్రకటించి తమ కొండరాజ్యంలోకి వచ్చిన బలాలన్నిటినీ యుద్ధంలో ఎదిరించసాగారు. ఇప్పుడు వారికి దోపిడీలు చేయటం తప్ప మరొక బతుకుతెరువు లేదు.

ప్రతాపుడు యుద్ధంలో ఉదయగిరి సైన్యాలతో చేరి పోరాడాడు. ఉదయగిరి ఓడిపోయి శత్రురాజుతో సంధి జరగగానే అతను తన తండ్రివద్దకు వెళ్లి, "నాన్నగారూ, నన్ను క్షమించండి. జరిగినదానికి నేను చాలా పశ్చాత్తాపపడుతున్నాను. నన్ను మళ్లీ మీ కొడుకుగా స్వీకరించండి," అని ప్రాధేయపడ్డాడు. తండ్రి ససేమిరా అన్నాడు. "నువు నా కొడుకువు కావు. నా ఇంట నీకు స్థానం లేదు. నువు వచ్చిన పని అయిపోతే నీదారిన వెళ్లవచ్చు. నీతో నాకు మాట్లాడేటందుకేమీ లేదు," అని ఆయన నిష్కర్షగా చెప్పాడు.




ఆయనకు ఎదురు చెప్పే సాహసం ఎవరికీ లేదు. అయిదేళ్ల పిల్ల హేమ మాత్రం ప్రతాపుణ్ణి వాటువేసుకుని, "బాబాయి, నువు వెళ్లిపోకు, ఇక్కడే ఉండు!" అన్నది.

"తాతయ్య నన్ను వెళ్లి పొమ్మంటున్నారు. ఎలా ఉండేదమ్మా?" అని ప్రతాపుడు అడిగాడు.

హేమ తన తాత వద్దకు వెళ్లి తన పినతండ్రిని వెళ్లనివ్వవద్దని ఎంతో బతిమాలింది, ఏడిచింది. కాని ముసలాయన తన పట్టు విడవలేదు.

ప్రతాపుడు కొండలలోకి తిరిగి వెళ్లిపోయాడు. కొండముఠాలవాళ్లు అతన్ని

ఎంతో ఆదరించి తమ నాయకుడుగా ఉండమని కోరారు. అతను అందుకు సమ్మతించాడు. ప్రతాపుడు నాయకత్వం వహించాక కొండ బందిపోటు ప్రతాపం పదిరెట్లు పెరిగినట్టయింది. దానికి కారణ మేమంటే ప్రతాపుడు యుద్ధ తంత్రం తెలిసినవాడు, అది కొండజాతివాళ్లకు తెలియదు. అదీగాక మామూలు సైనికులకన్న ఈ కొండజాతి వారిలో ధైర్యమూ, నిజాయితీ, క్రమశిక్షణా హెచ్చు. వారు తమ నాయకుడికోసం ప్రాణాలు అర్పించమంటే సంకోచించకుండా అర్పిస్తారు; అతడు చేసిన నియమాలను ప్రాణంపోయినా ఉల్లంఘించరు.

"నేను మీకోసం నా జీవితాన్ని అంకితం చేస్తాను. కాని మీకు భవిష్యత్తు లేదని తెలుసుకోండి. మనం ధనికులను దోపిడీ చేస్తేగాని బతకలేం. అందుచేత వారు మనని క్రూరమృగాలను వేటాడినట్టు వేటాడతారు. మనం ఈ కొండలు దాటిపోతే ఎందుకూ పనికిరాం. మిగిలిన ప్రపంచమంతా వారి పక్షాన ఉంటుంది. మనం ఇప్పుడే లొంగిపోయినట్టయితే ఏ బానిస బతుకో బతుకుతూ బలుసాకైనా తినవచ్చు. స్వాతంత్ర్యం కోసం పోరాటం సాగించినట్టయితే చివరకు రాసిపెట్టి ఉన్నది సర్వనాశనమే. అందుచేత స్వాతంత్ర్యంకోసం చచ్చిపోవటమో,



బానిసలుగా బతికివుండటమో ముందే నిశ్చయించుకోండి!" అని ప్రతాపుడు తన అనుచరులను హెచ్చరించాడు.

కొండజాతివాళ్లు పోరాడటానికే నిశ్చయించారు. చివరవరకూ వారి పోరాటానికి నాయకత్వం వహిస్తానని ప్రతాపుడు అందరి ఎదటా ప్రమాణం చేశాడు.

అది మొదలు కొండ బందిపోటు పేరు వింటే ఉదయగిరి ప్రాంతాల అందరికీ సింహస్వప్నమయింది. వారు ఎక్కడ దాగి ఉంటారో, ఎప్పుడు ఎక్కడ వచ్చిపడి దోపిడీలు చేస్తారో ఎవరికీ తెలియదు. ఎన్ని దోపిడీలు జరిగినా దొంగలు కంటికికూడా కనబడేవారు కారు. పరిస్థితులిలా వుండటం వల్ల, ఆ కొండల మధ్యగా ప్రయాణం చెయ్యటానికి ఉదయగిరి ప్రజలు భయపడేవారు.

ఉదయగిరిపై యుద్ధానికి వచ్చిన సేనలలో విజయవర్మ అనే యోధుడు ఒకడున్నాడు. యుద్ధం ముగిసిన కొంతకాలానికి అతను తన స్వదేశానికి బయలుదేరాడు. అతనివెంట అతని నౌకరు ఒకడున్నాడు. అతను ఉదయగిరి నుంచి బయలుదేరేటప్పుడు కొండల మధ్యప్రాంతానికి వెళ్లవద్దని హెచ్చరించి, అతను వెళ్లవలిసిన దారికూడా చెప్పారు.





విజయుడు గుర్తులు చూసుకుంటూ కొంత దూరం కొండదారిన వెళ్లాక దారి తప్పాడు. సూర్యాస్తమయం కాకముందే అతని కొక గ్రామం తగలవలిసింది, అది తగలలేదు. దానికి తోడు మసకచీకటితోబాటు పొగ మంచు కొండలనూ, అడవిప్రాంతాన్నీ చుట్టవేసింది. కొద్దిసేపట్లోనే చీకటి ముంచుకు వచ్చింది.

విజయుడు తన నౌకరుతో, "ఎక్కడ ఒక చిన్న కుటీరం కనబడినా ఈ రాత్రికి అక్కడే మజిలీ వేద్దాం. ఎక్కడైనా దీపపు వెలుగు కనిపిస్తుందేమో నువుకూడా శ్రద్ధగా చూడు!" అన్నాడు.

చీకటి పడినాక ఒక జాముసేపు వాళ్లు నడుస్తూనే ఉన్నారు. ఎక్కడా వారికి నర సంచారం పొడగట్టలేదు. చివరకు నౌకరు, "అయ్యగారూ, ఆ కనిపించేది దీపంకాదా?" అన్నాడు. పొగమంచులోనుంచి వారికి అస్పష్టంగా ఒక చిన్న వెలుగు కనపడింది.

అక్కడ మనుషులుంటారన్న ఉద్దేశంతో వాళ్లిద్దరూ వేగంగా నడిచి ఆ దీపం కనిపించిన దిక్కుగా వెళ్ళి చాలాసేపటికి ఒక ఎత్తయిన కొండ దిగువకు చేరుకున్నారు.

ఆ కొండ అతి విచిత్రంగా ఉన్నది. దాని పార్శ్వం గోడలాగా నిటారుగా ఉన్నది. ఆ పార్శ్వంలో ఒక గుహలాటిది ఉన్నది. ఆ గుహలోనుంచి వెలుగు వస్తున్నది. గోడలాగా ఉన్న ఆ కొండపార్శ్వాన్ని ఎక్కి గుహను చేరుకోవటం మనుష్యమాత్రుడి కెవరికీ సాధ్యమయే పని కాదు.

అయినా ఆ గుహలో మనుష్యులు ఉండి తీరాలి. ఆ మనుషులు బందిపోటువాళ్లు అయినప్పటికీ ఆ రాత్రికి వారిని ఆశ్రయించక తప్పదు. అందుచేత విజయుడు ఎలుగెత్తి కేకపెట్టాడు.

ఆ గుహలో ఉంటున్నది కొండ బంది పోటే. అది చాలా విశాలమైన గుహ, శాఖోపశాఖలు గలది. అందులో అనేకమంది

సుఖంగా నివసించటానికి చోటు ఉండటమే గాక అహారధాన్యాలు అనేక మాసాలకు సరిపడా నిలవ ఉంచుకోవటానికికూడా చోటున్నది. ప్రతాపుడుకూడా ఈ గుహలోనే ఉంటున్నాడు.

విజయుడు పెట్టిన కేకలు విని కొండవాళ్లు గుహలోనుంచి తొంగి చూశారు. వారు తాటినిచ్చెన ఒకటి దించి, "మీ గుర్రాలను కింద వదిలేసి, నిచ్చెన ఎక్కరండి! వాటి కేమీ ఆపద జరగదు," అన్నారు.

ఆ గుర్రాలు మళ్లీ తమకంట పడతాయని గాని, తాము తిరిగి ప్రాణాలతో ఆ గుహ నుంచి బయటపడతామనిగాని ఆటే నమ్మ కంలేక పోయినా విజయుడు ధైర్యంగా తన నౌకరుతోబాటు గుహలోకి ఎక్కి వచ్చాడు.

గుహలో వారికి మంచి భోజనమూ, పడుకునేటందుకు మెత్తలూ దొరికాయి. వారిని ఎవరూ ఎలాటి ప్రశ్నలూ వెయ్యలేదు. తెల్లవారుజామున ప్రతాపుడు వచ్చి విజయుడితో, "మీరు బయలుదేరటానికి వేళ అయింది. మీ గుర్రాలకు దాణాకూడా పెట్టాం. మీకు దారి చూపటానికి నేను కొంతదూరం వెంటవస్తాను," అన్నాడు.

"నిన్న రాత్రి మీరు మాకిచ్చిన ఆతిథ్యాన్ని ఎన్నటికీ మరవలేను," అంటూ విజయుడు ప్రతాపుడికి తన కృతజ్ఞత చెప్పుతున్నాడు. తరవాత అతనూ, అతని నౌకరూ కొండ దిగివచ్చి గుర్రాలమీద బయలుదేరారు. ప్రతాపుడు వారిని ఒక కోసుదూరం సాగనంపి వారు వెళ్లవలిసిన మార్గం చూపించాడు.




విజయుడు అతనితో, "మీరెవరు? ఈ గుహలో ఎందుకుంటున్నారు? ఇక్కడ మీకు అన్ని సదుపాయాలూ ఎలా అమరుతున్నాయి?" అని అడిగాడు.

"మేము కొండ బందిపోటువాళ్లం. మమ్మల్నిగురించి మీరు అనేక వార్తలు విని ఉంటారు. అందులో కొన్ని అబద్ధమని

మీరే గ్రహించి ఉంటారు. నేను వీళ్లకు నాయకుణ్ణి. కాని నేను కొండజాతివాణ్ణి కాను. నేనూ ఒక రాజవంశం వాణ్ణే, కాని పరిస్థితుల ప్రోద్బలంచేత వీరికి నాయకుణ్ణి అయాను. ప్రస్తుతానికి మాకు జీవితం సుఖంగానే జరిగిపోతున్నది, కాని ఇలా ఎంత కాలమో జరగదు, నాకు తెలుసు. మా ఆఖరు రోజులు సమీపించినప్పుడు నేను మీకోసం కబురుచేస్తాను. నాకోరిక మన్నించి నన్ను చూడటానికి రావాలి!" అన్నాడు ప్రతాపుడు.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. బందిపోటును ఎలాగైనా నిర్మూలించకపోతే లాభం లేదనీ, ఉదయగిరికి వారు పక్కలో బల్లెంగా ఉన్నారనీ రాజుగారికి విజ్ఞాపనలు వెళ్లాయి. రాజుగారు కొంత సైన్యాన్ని ఉదయగిరి కొండలలోకి పంపాడు. ఆ సైన్యం వెంట విజయుడుకూడా ఉన్నాడు.

సైన్యాలు దెబ్బతిన్నప్పటికీ బందిపోటు చివరకు చుట్టుముట్టబడింది. భయంకరమైన ఆఖరు పోరాటంలో ప్రతాపుడు తీవ్రంగా గాయపడి దొరికిపోయాడు. ఎక్కువమంది కొండజాతివాళ్లు తమ స్వేచ్ఛకోసం ప్రాణాలు వదిలారు. కొద్దిమంది మటుకు ప్రాణాలతో దొరికారు.

ఎవరో యుద్ధఖైదీ తనకోసం కబురు చేసినట్టు విని విజయుడు అతనిని చూడ



టానికి వెళ్ళాడు. మొదట్లో అతను ప్రతాపుణ్ణి గుర్తించలేదు. పన్నెండేళ్ల కాలంలో ప్రతాపుడు చాలా మారిపోయాడు. అదీగాక ప్రతాపుడు ఇంతకాలమూ ఈ బందిపోటు వాళ్లకు విశ్వాసంతో నాయకుడుగా ఉంటున్నాడని విజయుడు అనుకోలేదు, ఏనాడో వారిని విడిచిపెట్టి వెళ్లిపోయి ఉంటాడనుకున్నాడు.

ప్రతాపుడు విజయుడితో ఈసారి తన నిజమైన కథ యావత్తూ చెప్పి, "నేను నిశ్చింతగా ప్రాణం వదులుతున్నాను. మా తండ్రిగారి ఇంట నాకోసం విచారించేవాళ్లు హేమ తప్ప మరెవరూ లేరు. నా జీవితం సఫలమయిందనీ, నాకు ఎవరిమీదా, మా నాన్నగారిపైన కూడా ఎలాటి ఈర్ష్య లేకుండా చనిపోయాననీ, నాకోసం దుఃఖించ వద్దనీ హేమతో చెప్పి, నా జ్ఞాపకార్థం ఈ ఉంగరం హేమ కివ్వండి!" అంటూ తనవేలిన ఉన్న ఉంగరం తీసి విజయుడికిచ్చాడు.

విజయుడు ఆ ఉంగరాన్ని తీసుకుపోయి హేమకిచ్చాడు. తరవాత హేమ విజయుణ్ణి వివాహమాడింది. వారిద్దరూ తరుచు ప్రతాపుణ్ణి గురించి మాట్లాడుకుని ఎంతో సంతృప్తి చెందేవారు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, ప్రతాపవర్మ స్వభావం ఎలాటిది? అతను ఒక కొండజాతిదానికోసం తనకులానికి ఎందుకు



వెలి అయాడు? వెలి అయినవాడు తిరిగి తండ్రికి క్షమాపణ ఎందుకు చెప్పుకున్నాడు? తన భార్యతో సుఖం లేనందువల్ల అతను చేసిన పనికి పశ్చాత్తాపపడ్డాడా? పశ్చాత్తాప పడినవాడైతే తిరిగి కొండజాతివాళ్ల వద్దకు వెళ్లి వారికి నాయకత్వం ఎందుకు వహించాడు? తన తండ్రి తన క్షమాపణ స్వీకరించలేదన్న కోపంచేతనా? అలా అయితే అతను చనిపోయేటప్పుడు తనకు ఎవరిపైనా ఎలాటి ఈర్ష్య లేదని ఎందుకు అన్నాడు? ఈ అనుమానాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ప్రతాపుడు తాను చేసిన ఏపనికీ పశ్చాత్తాపపడలేదు. అతని స్వభావం ధర్మంకోసం జీవితాన్ని ధారపోసే స్వభావం. తాను ప్రేమించిన మనిషిని పెళ్లాడటం ధర్మమని పెళ్లాడాడు. తన దేశాన్ని రక్షించుకునేటందుకు శత్రువుతో యుద్ధం చెయ్యటం ధర్మమనుకుని యుద్ధం చేశాడు. ఆ యుద్ధంలో తన పక్షం ఓడి పోగానే తిరిగి తన తండ్రితో రాజీపడటం ధర్మమనుకుని క్షమాపణ చెప్పుకున్నాడు. అందువల్ల లాభం లేకపోగా, స్వాతంత్ర్యం కోసం పోరాడే కొండజాతివాళ్ల పోరాటాన్ని బలపరచటం ధర్మమనుకుని వారికి నాయకత్వం వహించాడు. అతను జీవితంలో సుఖాన్నీ, ఆనందాన్నీ ఆశించలేదు. అందుచేతనే తనను సుఖపెట్టలేకపోయిన తన భార్యపైనగాని, తన క్షమాపణను నిరాకరించిన తన తండ్రిపైనగాని అతనికి ఈర్ష్య కలగలేదు. తాను ధర్మమనుకున్న దాని కోసం తుదివరకూ పోరాడి ప్రాణాలు వదిలాడు. కనక అతను తన జీవితం సఫలమయిందనుకున్నాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కాగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)






"తమరు వేసుకున్నవి నల్ల బూట్లే,
కావలిస్తే అద్దంలో చూడండి!"




"నవ్వకండి! ఈ పొట్టే లేకపోతే
అడుగున పడిపోయి ఉందును!"




"ఇంత చిన్నద్వారంఉన్న ఇల్లేమిటిరా?"
"నువు వరండాలోనే ఉండు నాన్నా!"




"నల్ల చొక్కావాడు ఇటుగావచ్చాడే.
ఏమైపోయాడో!"




# ఆసపిపాక్ష్వకారిత్వము

అందందు చనునట్టి - తొందరలోన
ముందు చెప్పిన దారి - కందువ తప్పె.
ఆకలి దప్పుల - నల్లాడుకొనుచు
ఏకాకియై దోవ - యెటొ వీరుపడక
చీకటికోనల - చెచ్చెఱ పోవ
అకట నొకచోట - అలుకుడు నయ్యె;
కనిపించె నొకడు మా-సిన మేనితోడ
మినమిన చక్రమ్ము - మెఱసెను తలను.

నాలవవాడు :

ఏమిట్లు పడియుంటి - వెవ్వరు నీవు ?
ఏమి యీచక్ర మి - ట్లేల నిన్ బట్టె ?

అక్కడున్నవాడు :

తనివి తీరని ఆశ - తఱుమ వచ్చితిని
మును కానవచ్చిన - గనులెల్ల విడిచి
మణులు చిక్కునటన్న - మహితాశ రాగ
మణులు కాదిట నొక - మానిసి యుండె.
వాని శిరస్సుపై - వఱలు చక్రమ్ము
నా నెత్తిపై కెక్కె - నరిగె నాతండు.

* * *

అని చెప్పుచుండెడు - నంతలో చక్ర
మును, వీని తలపయి - మురిసి కూర్చుండె.
" ఇది యేమి కర్మ మి-య్యది ఎట్లు పోవు ?
పదిలమ్ము చెడి యిట - పడియుండు టెట్లు ?"
అన తొలివాడనె, - " అంతియేనయ్య
వనట నందుచునుండ-వలెనోయి నీవు
మఱియొక్క డిట వచ్చి - మాట్లాడుదనుక
దఱిదాపు లేక ఈ-దఱి నుండవలయు"
అని వాడు తనదారి - నరిగె వీడొకడు
వనరుచునుండె నె-వ్వారును లేక.

* * *

అట సువర్ణము గొన్న - ఆతడు మఱల
అటులేగు నాలవ - ఆతనికొఱకు

విద్వాన్ విశ్వం

కాచి వేచియు రాని - కారణమ్మేమి
చూచివచ్చెదనంచు - చొఱవతో వచ్చె.
వచ్చి చూచునుగదా - వాడిట్టు లుండె
అచ్చరిత్రము చెప్పె - అవురుమంచు.

సువర్ణసిద్ధి :

వలదంటె వింటివా - వచ్చితి విటకు
కలిగిన బంగారు - కాల దన్నితివి.
చదువున్ననేమి సం-స్కారము నేల ?
మొదల కావలె తెల్వి - అది వినలేదె ?

చక్రధారి :

అది యేమి ఎటువలె - నది వినిపింపు

సువర్ణసిద్ధి :

ఇదె వినిపింతు, ఉ-న్నది కథ యొకటి.

*　　*　　*

నలుగురు సోదరుల్ - కలరొక యూర
పలు మంత్రశాస్త్రాల - పండితుల్ ముగురు
కడగొట్టువాని కొ-క్కటి రాదుగాని
మిడిదేరినది తెల్వి - మెలకువై నతను.
తమ విద్య చూపి ధ-నము దెత్తుమంచు
తమ రాజధానికి - తరలిరి వారు.
చిన్నవాడును వచ్చి - చేరగా చూచి
అన్నలిద్దరు వాని - నాగుమన్నారు.
చదువేమి రాని యీ - చపట యేమిటికి ?
వదిలించు తమ డబ్బు - వద్దనినారు.




మూడవ అన్న త-మ్ముని బుజ్జగించి
వీడు తెల్విగలాడు - వెంట రానిండు.
అని చెప్ప నందఱు - చనుచున్నవారు
వనములు వాగులు - వరుసగా దాటి.
అడవిని బడిపోవ - నట కానవచ్చె
బడుగు సింహపు అస్థి-పంజర మొకటి
మంత్రా లెఱింగిన - మానవుల్ పూని
మంత్రవిద్యను చూప - మతి జనియించి
ఎముకల కూర్చి - తమ మంత్రశక్తి
నిముసాన బ్రదికింప - నెంచిరి దాని.
పసివాడు నవ్వి అ-పని వలదనెను
అసమర్థుడవు చూడు - మనిరి వారేమొ.




'పనిలేక సింహమ్ము - బ్రదికించుటేల ?
వనమృగమ్మిది మిమ్ము - పట్టిపల్లార్చు'
అని పసివాడెంత - అఱచిన వినక
కనిపించెదము విద్య - కనుమంచు వారు
ఎముకల గూఱిచి - ఏవేవొ చేసి
క్రమముగా మంత్రముల్ - క్రమ్మఱ చదువ
ఇక తప్పదని యెంచి - ఎటొ చిన్నవాడు
చకచక చెట్టెక్కి - సర్దుకయుండె.
మంత్రాల మహిమతో - మరు నిముసమ్మె
అంత్రముల్ గదుల నా - ర్చుచు సింహమంత
లేచి వారిని మ్రింగి - లీలగా నరిగె
చూచి దుఃఖించి నా-ల్గో చిన్నవాడు
అన్నల తెల్వికి - అయ్యో అటంచు
చిన్నగా తన ఊరు - చేరగా చనియె.

* * *

సువర్ణసిద్ధి :

ఎన్ని శాస్త్రమ్ము లెం-తే నేర్వనేమి
అన్న లోకజ్ఞాన - మదియె కావలయు.
కత లేదె మూర్ఖ పం-డితులను గూర్చి ?

చక్రధారి :

కొతుకేల ? చెప్పు మా-కత ఏమొ నాకు.

సువర్ణసిద్ధి :

ఒక పురమ్మున నల్వు - రుండిరి విప్రు
లొకయింత మైత్రితో - నొప్పుచుండుదురు.
వారు కన్యాకుబ్జ-పట్టణమ్మునకు
చేరి పన్నెండేండ్లు- చిత్తుగా చదివి
సర్వవిద్యల నేర్చి - గుర్వుల కెఱగి
గర్వితులై యింటి-కై పయనించి
వచ్చుచుండగ నొక్క - పట్టున దారి
అచ్చముగా చీలి-నది రెండుగాను.
ఎటు పోవ తోచక - నటులిటు లనుచు
గుటకలు మ్రింగుచు - కూర్చుండి రచట.
అప్పుడే ఒక శవ - మ్మటు గొనిపోవ
"గొప్పవారలు చన్న - దెప్పుడు దారి,"
అని అటు వోయి; రం-తనె గాడిదొకటి
చనిపోయి వలకల - కనిపించె బాగ.



"సరి స్మశానమ్మున - సంగాతు లెపుడు
వరమిత్రు"లని ఒక్క - పద్యమ్ము చదివి
గాడిద మోసుక - కదలిరి వారు
ఓడనా కనిపించె - ఒంటె మార్గమున
"ధర్మమ్ము త్వరగతి" - తప్పదటంచు
ధర్మమే అది అని - తగులుకొన్నారు
కట్టిరి దానికి - గాడిద నంత
తిట్టుచు చాకలి - కట్టెతో వచ్చె.
పారిపోవుచునుండ - ఏ రథమయ్యె
నీరమం దొక ఆకు - దారిని పోవ
"ఏటిలో వచ్చు నే-దే ఆకు మనల
చోటుకు జేర్చు"నన్ - శ్లోకమ్ము చదివి,
ఒకడు దానిని పట్టి - ఉరికెను నీట;
ఇక కొట్టుకొనిపోవు - నీతని జూచి,
"అంతయు పోవుచు-న్నపు డర్ధమైన
సంతరింపగవలె - సరి"యని వారు
వాని జుట్టును బట్టి - వడి తల గోసి
పూనిక తమ విద్య - పాలియించినారు.
అరిగి రావల నొక్క - పురమున కచటి
వరగృహస్థుల యింట - సాపడబోయి
సేమియల్ వడ్డింప - "ఛీ దీర్ఘసూత్రి
వేమఋ నశియించు" - వినుడనె నొకడు.
వడలతూటును జూచి - "బహ్వనర్థములు
తొడరు ఛిద్రములనన్" - దూరాడె నొకడు.
ఇటు లందఱా తిండి - కేదొ కల్పించి
తటతట లేచి ఒ-క్కట దారి చనిరి.
కావున చదువున్న - కాదు, లోకజ్ఞ
తే వలయు నటంచు - తెలుసుకోవన్న!

* * *

చక్రధారి:

అటు లనరాదు దై-వాగ్రహమ్మనను
పటుబుద్ధి నశియించు, - నటు అల్పబుద్ధి
హాయిగా తిరుగు; ఏ-మనలేము సుమ్ము

సువర్ణసిద్ధి:

అ యర్థమేమొ నా - కానతిమ్మిపుడు.

# చెడ్డస్వభావం

ఒక తేలు ప్రవాహాన్ని దాటవలిసి వచ్చింది, అది ఒక తాబేలుతో, "బాబ్బాబు, నన్ను ఎలాగైనా అవతలి ఒడ్డుకు చేర్చు," అన్నది.

"నా వీపుమీద ఎక్కించుకుని అలాగే చేర్చుదునుగాని మధ్యలో నువు నన్ను కుట్టినట్టయితే నేను మునిగిపోతాను," అన్నది తాబేలు.

"నాకాపాటి జ్ఞానం లేదనుకున్నావా? నువు మునిగితే నేనుమాత్రం మునగనా?" అన్నది తేలు.

ఈ మాట నచ్చి, తాబేలు తేలును తన వీపున ఎక్కించుకుని ప్రవాహానికి అడ్డంగా ఈదసాగింది.

కాని మధ్యదారిలో తేలు తాబేలును కుట్టనేకుట్టింది. తాబేలు మునిగి పోతూ, "నీ జ్ఞానం ఏమయింది? నన్ను కుట్టావుగదా, ఇద్దరమూ మునిగి పోమా?" అన్నది ఆశ్చర్యంతో.

"అన్నా, నా జ్ఞానంలో లోపం ఏమీలేదుగాని, నా స్వభావం చాలా చెడ్డది. దాన్ని మార్చుకోలేక నిన్ను కుట్టాను. ఏంచేస్తాం?" అన్నది తేలు.





# రాజద్రోహం

పూర్వం డంకన్ అనే రాజు స్కాట్‌లాండ్ దేశాన్ని పాలిస్తూ ఉండేవాడు. ఆయనకింద ఉన్న సామంతులలో గ్లామిస్‌కు ప్రభువైన మాక్‌బెత్ ఒకడు. ఇతను రాజుగారికి దగ్గిర బంధువే గాక అనేక యుద్ధాలలో సాటిలేని పరాక్రమం చూపి రాజుగారి అభిమానం సంపాదించుకున్నవాడు.

రాజుగారి కింద సామంతుగా ఉండిన మరొక సామంతు కాడర్‌ప్రభువు. ఇతను పైకి ఎంతో రాజభక్తి నటించుతూ రాజద్రోహం తలపెట్టి కుట్ర చేశాడు. ఈ కుట్ర ఫలితంగా నార్వేదేశం నుంచి సేనలు భారీ ఎత్తున స్కాట్‌లాండ్‌పైకి దండెత్తి వచ్చాయి.

ఈ సేనలను ఎదుర్కొనటానికి మాక్‌బెత్ తమ సేనలతో బయలుదేరాడు. అతని వెంట బాంకో అనే సేనానికూడా ఉన్నాడు. నార్వేసేనలకూ స్కాట్‌సేనలకూ తీవ్రమైన యుద్ధం జరిగింది. చిట్టచివరకు మాక్‌బెత్ పరాక్రమంవల్ల, యుద్ధభూమి నుంచి శత్రుసేనలు చెదిరి పారిపోయాయి.

ఈలోపుగా కాడర్‌ప్రభువు చేసిన కుట్ర బయటపడింది. ఆయన తన నేరం ఒప్పుకున్నాక, ఆయనను ఉరితీశారు. ఇదే సమయానికి, మాక్‌బెత్ యుద్ధభూమినుంచి విజయుడై తిరిగి వస్తున్న వార్త తెలియవచ్చింది. రాజుగారు ఆనందభరితుడై, "మాక్‌బెత్‌ను కాడర్‌కుకూడా ప్రభువుగా చేస్తాను," అని ప్రకటించాడు.

యుద్ధభూమినుంచి బాంకోతోసహా తిరిగి వస్తున్న మాక్‌బెత్‌కు ఈసంగతి తెలియదు. వారిద్దరూ ఒక బీడు దాటి వస్తూండగా అకస్మాత్తుగా వారి ఎదట ముగ్గురు ముసలమ్మలు ప్రత్యక్షమయారు. వారిలో ఒకతె, "గ్లామిస్‌ప్రభువుకు జయం!" అని మాక్‌బెత్‌ను సంబోధించింది. రెండవది, "కాడర్ ప్రభువుకు జయం!" అన్నది. మాక్‌బెత్

విలియం షేక్స్పియర్

చెవులకు ఈ సంబోధన అర్థంకాలేదు; కాడర్ప్రభువు కుట్ర చేసిన సంగతికూడా అతను ఎరగడు.

మూడవ ముసలిది, "కాబోయే మహా రాజుకు జయం!" అన్నది.

మాక్‌బెత్ ఈ మాటను ఏమాత్రమూ నమ్మలేకపోయాడు. రాజుగారికి ఇద్దరు ఈడు వచ్చిన కొడుకులున్నారు. రాజ్యం వారికి పోతుందిగాని తనకు రావటం అసంభవం.

మాక్‌బెత్‌ను ఈవిధంగా సంబోధించిన ముసలమ్మలు, బాంకోనుకూడా సంబోధించారు. "మాక్‌బెత్‌కన్న తక్కువవాడివి, కాని ఎక్కువవాడివికూడానూ!" "అంతకంటె అదృష్టహీనుడివైకూడా ఎక్కువ అదృష్టవంతుడివి!" "నువు రాజువు కాకపోయినా నీ సంతతివాళ్లు రాజులౌతారు!" అన్నారు ముసలమ్మలు.

"మీమాటలు నాకు కొంచెంకూడా అర్థం కావటంలేదు. నేను గ్లామిస్ప్రభువు నన్న మాట నిజమే కాని కాడర్ప్రభువు నెలా అవుతాను? నాకు రాజ్యం ఎలా వస్తుంది?" అని మాక్‌బెత్ అడుగుతుండగానే ముసలమ్మలు అంతర్ధానమైనారు. ఈ వింత చూసి సేనానులిద్దరూ నివ్వెరపోయారు.

ఇంతలో రాజభటులు వచ్చి, "కాడర్ ప్రభువుకు జయం!" అని మాక్‌బెత్‌ను



సంబోధించారు. జరిగిన సంగతి వినగానే మాక్‌బెత్‌కు ముసలమ్మల మాటలలో గురి కుదిరింది. తాను రాజు కావటంకూడా నిజమే కావచ్చు ననిపించింది. అతని హృదయంలో రాజద్రోహపు బీజం నాటు కున్నది. అతను దారిలో తనకు ముస లమ్మలు కనిపించి చెప్పిన విషయాలన్నీ ఉత్తరం రాసి భార్యకు పంపాడు.

అతని భార్య ఆ ఉత్తరం చూసుకుని సంతోషించింది. ముసలమ్మలు చెప్పినట్లే మాక్‌బెత్ కాడర్‌ప్రభువు అయాడు గనక స్కాట్‌లాండ్‌కు రాజుకూడా అవుతాడు. ఇక డంకన్‌ను హత్య చేయటమే తరవాయి. ఆ హత్య ఎలాగైనా జరిగితీరాలని మాక్‌బెత్ భార్య నిర్ణయించుకున్నది.

మాక్‌బెత్ రాజధానిలో రాజుగారిని చూసి ఆయన ప్రశంసలు అందుకున్నాడు. రాజు గారు తన సామంతులందరినీ చూసి వచ్చే ప్రయాణంమీద బయలుదేరి, ఒక రాత్రి మాక్‌బెత్ ఇంట విశ్రమించి మర్నాడు మళ్లీ ప్రయాణం సాగించ నిశ్చయించాడు. ఆయన అతిథ్యానికి ఏర్పాట్లు చెయ్యటంకోసమని ముందుగా మాక్‌బెత్ తన భవనానికి తిరిగివచ్చాడు.

డంకన్‌ను చంపి తాను రాజు కావటానికి మాక్‌బెత్‌కు ఇది చాలా గొప్ప అవకాశం.







ఆ రోజు ప్రయాణంచేసి ఉండటంచేత రాజుగారు మాక్‌బెత్ ఇంట భోజనం చెయ్యగానే వెళ్లి పడుకుని నిద్రపోయాడు. ఆయన అంగరక్షకులకు మాక్‌బెత్ భార్య పానీయాలలో మత్తుమందు కలిపి ఇచ్చింది. రాజుగారితోబాటు వాళ్లుకూడా వెంటనే గురకపెట్టి నిద్రపోయారు.

సరిగా అర్ధరాత్రివేళ మాక్‌బెత్ రాజుగారి పడకగదికి వెళ్లి, అయన అంగరక్షకుల కత్తులతో రాజుగారిని హత్య చేసి, ఆ కత్తులను తిరిగి వారి పక్కనే ఉంచి తన భార్య వద్దకు వచ్చి, "పని పూర్తిచేశాను!" అన్నాడు. అతని మతి మతిలో లేదు. ఒక గొప్ప పని సాధించిన ఆనందం అతనికి కొంచెంకూడా కలగలేదు.

ఆ విషయం భార్యా భర్తలిద్దరూ రహస్యాలోచన చేశారు. రాజు కావాలన్న కాంక్ష ఎంత తీవ్రంగా ఉన్నప్పటికీ రాజుగారిని చంపటానికి మాక్‌బెత్ జంకాడు. రాజుగారు దగ్గిర బంధువు, పరమ సాత్వికుడు, మంచివాడు, మాక్‌బెత్‌ను ఎంతో అభిమానంతో చూసేవాడు.

మాక్‌బెత్ భార్యమాత్రం ఏమాత్రమూ వెనకాడలేదు. ఆమె ఈ హత్య జరిగే తీరాలన్నది. తన భర్త రాజు కావాలన్న నిశ్చయం తప్ప ఆమె మనస్సులో మరొకటి లేదు. తన భర్తకు బాగా నూరిపోసి ఆమె అతనిచేత రాజును హత్య చేయటానికి ఒప్పించింది.

రాజుగారు తెల్లవారుజామునే లేపమని తన అనుచరులతో చెప్పి ఉన్నాడు. వాళ్లు వచ్చి తలుపు తట్టారు. మాక్‌బెత్, అతని భార్యా అప్పుడే నిద్ర లేచినవారిలాగా వెళ్లి తలుపు తెరిచారు. శయ్యాగారంలో ఆయన అనుచరులకు రాజుగారి కళేబరం కనిపించింది. నెత్తురు కత్తులు పక్కన పెట్టుకుని నిద్రపోయే రాజుగారి అంగరక్షకులే హత్యచేసినట్టు భావించినవాడిలాగా మాక్‌బెత్ వారిద్దరినీ అప్పుడే చంపేశాడు.





ఆ కలవరంలో రాజుగారి పరివారంలో వారంతా లేచారు. రాజుగారిని ఎవరో దారుణంగా హత్యచేశారని వారికి తెలిసిపోయింది. రాజుగారి కొడుకులిద్దరూ కూడబలుక్కున్నారు. "ఎవరో రాజరికానికి చిచ్చుపెట్టి అందులో నాన్నగారిని హోమం చేశారు. ఈ చిచ్చు ఇంతటితో చల్లారేది కాదు. బతికి ఉంటే బలుసాకు తినవచ్చు," అనుకుని వారు ఎవరితోనూ చెప్పకుండా పారిపోయారు. పెద్దవాడూ, యువరాజూ అయిన మాల్‌కోమ్ అనేవాడు ఇంగ్లాండుకు వెళ్ళిపోయాడు. రెండవవాడు ఐర్లాండుకు పారిపోయాడు.

వారిద్దరూ పారిపోవటం మాక్‌బెత్‌కు చాలా లాభించింది. ఎందుచేతనంటే రాజుగారి వెంటఉన్న సామంతులలో ఏ ఒక్కడు కూడా ఈ హత్యను అంగరక్షకులు బుద్ధిపూర్వకంగా చేశారని నమ్మలేదు. కాని రాజుగారి కొడుకులు వారికి లంచంపెట్టి తమ తండ్రిని హత్యచేయించి, తమ నేరం బయటపడిపోతుందన్న భయంతో పారిపోయారని నమ్మటం తేలిక అయింది. అంతేకాక రాజుగారి అనంతరం ఎవరు రాజుకావాలన్న సమస్యకూడా లేకుండా పోయింది. రాజకుమారులు పరారీ అయి



పోయారు. సామంతులలో మాక్‌బెత్‌కన్న రాజుగారికి ఆత్మీయుడూ, రాజు కాదగినవాడూ మరొకడు లేడు.

మాక్‌బెత్ స్కాట్‌లాండ్‌కు రాజుగా పట్టాభిషిక్తుడయాడు. ఆయన భార్య రాణి అయింది. ముసలమ్మల జోస్యం ఫలించింది, మాక్‌బెత్ ఎందుకైతే రాజద్రోహం చేశాడో అది సిద్ధించింది.

కాని మాక్‌బెత్ కష్టాలు తగ్గటానికి మారుగా హెచ్చసాగాయి. అతనిని అంతరాత్మ వేధించటమే గాక అనుమానాలుకూడా వేధిస్తున్నాయి. బాంకో అతనికి పక్కలో బల్లెంలాగా ఉన్నాడు. మాక్‌బెత్ నిర్దోషి అని



అందరూ అనుకున్నప్పటికీ బాంకో సులువుగా నిజం ఊహించగలడు. ఎందుకంటే ముసలమ్మలు తనకు జోస్యం చెప్పినప్పుడు అతను పక్కనే ఉన్నాడు. అది అలా ఉండగా, "నేనింత దారుణ హత్య చేసి రాజ్యం సంపాదించినది బాంకో పిల్లలకు పప్పగించటానికా?" అని మాక్‌బెత్ బాధపడసాగాడు. బాంకోనూ, అతని కొడుకునూ హత్యచేస్తే తప్ప మాక్‌బెత్‌కు మనశ్శాంతి చేకూరేలాగు కనిపించలేదు. ఆయన ఇద్దరు ముగ్గురు హంతకులను పిలిపించి, వారితో మాట్లాడి ఉంచాడు. తరవాత ఒకరాత్రి తన భవనంలో విందు ఏర్పాటుచేసి, దానికి సామంతులందరినీ ఆహ్వానించి, బాంకోనూ అతని కుమారుణ్ణికూడా ఆహ్వానించాడు.

ఆరాత్రి బాంకో, అతని కుమారుడూ విందుకు వస్తూండగా మాక్‌బెత్ నియోగించిన హంతకులు చీకటిలో బాంకోపై పడి పొడిచేశారు. కాని బాంకో కొడుకు పారిపోయాడు. ఇదికూడా మాక్‌బెత్‌కు లాభించింది. ఎందుకంటే బాంకోను హత్యచేసి పారిపోయినది అతని కొడుకే అని మాక్‌బెత్ సామంతులను నమ్మించగలిగాడు.

అయితే ఆ రాత్రి విందు జయప్రదంగా సాగలేదు. మాక్‌బెత్ తన ఆసనంలో కూర్చోబోతూండగా అతనికి బాంకో ఆకారం దాని



మీద కనిపించింది. ఎవరికీ కనిపించని ఆ బాంకోతో మాక్‌బెత్, "నేను నిన్నేమీ చెయ్యలేదు. నన్ను చూసి తల ఆడించకు!" అని కేకలుపెట్టాడు. అందరూ నిర్ఘాంతపోయి, "ఏమిటి, మహారాజా?" అని అడిగారు.

"నా భర్తకు ఒక్కొక్కసారి ఇలాటి వికారం కలుగుతూ ఉంటుంది. ప్రశ్నలతో ఆయనను రెచ్చగొట్టకండి. దయచేసి ఈ పూటకు మీరంతా వెళ్ళిపొండి. ఆయనే తిరిగి మామూలు మనిషి అవుతారు," అంటూ మాక్‌బెత్ భార్య అందరినీ పంపేసింది.

రెండు హత్యలు చేసినా మాక్‌బెత్‌కు మనశ్శాంతి చేకూరలేదు. బాంకో కొడుకు తప్పించుకుని పోనేపోయాడు. ఇంకా తనకు శత్రువు లెవరున్నారో తెలియదు. అందుచేత తన భవిష్యత్తు తెలుసుకునేటందుకుగాను మాక్‌బెత్ ముసలమ్మలు తనకు కనిపించిన చోటికి వెళ్ళాడు. ముసలమ్మలు ముగ్గురూ కనిపించారు.

"నాకు కొన్నాళ్ళుగా తీరని సందేహాలున్నాయి, వాటిని మీరు తీర్చాలి," అన్నాడు మాక్‌బెత్ వారితో.

ముసలమ్మలు దయ్యాలను ఆవాహన చేశారు. ఒక దయ్యం ప్రత్యక్షమై, "ఫైఫ్ ప్రభువైన మాక్‌డఫ్ గురించి హెచ్చరికగా ఉండు!" అన్నది.





మరొక దయ్యం, "ఆడది ప్రసవించిన ఏమనిషివల్లా నీకు కీడు రాదు. అందుచేత నువు నిశ్చింతగా ఉండు, నీయిష్టంవచ్చిన ఘోరాలు ధైర్యంగా చెయ్యి," అన్నది.

"అయితే మాక్‌డఫ్ నన్నేమీచెయ్యలేడు. అయినా శత్రుశేషం ఉంచను; వాణ్ణి హత మార్చుతాను!" అనుకున్నాడు మాక్‌బెత్.

మూడవ దయ్యం కనిపించి, "మాక్‌బెత్, బర్నామ్‌అడవి కదలి డన్సినేన్‌కొండకు వచ్చే దాకా నీకు అపజయం ఉండదు!" అన్నది.

ఈ మాటలు విన్నాక మాక్‌బెత్‌కు శాంతి కలిగింది. తనకు ఎవరూ హాని చెయ్యలేరనీ, తనను చంపలేరనీ అతను నమ్మాడు.



"అయితే ఒక్క విషయం చెప్పండి, నా రాజ్యాన్ని ముందుముందు బాంకో సంతతి వారు ఏలుతారా?" అని అతను దయ్యాలను అడిగాడు. ఈ ప్రశ్నకు సమాధానంగా ఎనిమిదిమంది రాజుల రూపాలు అతని పక్కగా నడిచి వెళ్ళినట్టు కనిపించింది. వారి వెనకగా బాంకో ఆత్మ వచ్చింది. ముందు వెళ్ళిన ఎనిమిదిమందీ బాంకో సంతతివారని మాక్‌బెత్ గ్రహించాడు.

ఇంటికి తిరిగి రాగానే మాక్‌బెత్ ఒక దుర్వార్త విన్నాడు. ఫైఫ్‌ప్రభువైన మాక్‌డఫ్ పారిపోయి ఇంగ్లాండులో ఉంటున్న మాల్‌కోమ్‌ను చేరుకున్నట్టు తెలిసింది. మాక్‌బెత్‌ను తొలగించి మాల్‌కోమ్‌ను స్కాట్‌లాండ్ రాజుగా ప్రతిష్ఠించటానికి మాక్‌డఫ్ ప్రయత్నాలు సాగిస్తున్నాడట.

మాక్‌బెత్ ఈ వార్త విని కోపావేశంలో మాక్‌డఫ్ భార్యనూ, కుమారుణ్ణీ, అతని బంధువర్గాన్ని క్రూరంగా చంపించేశాడు. అతని హత్యాకాండ నానాటికీ మితిమీర సాగింది. సామంతులలో కొందరు ఇది చూసి సహించలేక పారిపోయి మాక్‌డఫ్ పోగుచేసుకుని వస్తున్న సేనలో చేరిపోయారు. మిగిలిన సామంతులు ప్రాణాలకు వెరిచి కుక్కిన పేనులలాగా మాక్‌బెత్ వెంట





ఉన్నారేగాని, వారికి అతనిపై ఏమాత్రమూ భక్తిగౌరవాలు లేవు.

మాక్‌బెత్‌కు ఇప్పుడున్న ఆప్తురాలు అతని భార్య ఒక్కతే. ఆమె తన భర్తను ఊరడించటానికి సాధ్యమైనదంతా చేసింది, కాని ఆమె మనస్సుకూడా వికలంగానే ఉన్నది. డంకన్‌రాజును హత్య చెయ్యటంలో తాను నిర్వహించిన పాత్రను ఆమె మరిచిపోలేదు. అర్ధరాత్రివేళ ఆమె నిద్రలోనే లేచి నడిచేది, డంకన్ రక్తం తన చేతికి అంటుకుని, ఎంత కడిగినా పోనట్టు భ్రాంతి పడుతూండేది. చివరకు ఆమె ఆత్మహత్య చేసేసుకున్నది.

ఇప్పుడు మాక్‌బెత్‌పై సానుభూతి చూపే ప్రాణి ఎవరూ లేరు. అతన్ని తుదముట్టించటానికి ఇంగ్లాండు నుంచి సేన వస్తున్నట్టు తెలిసింది. అతనికి చావంటేకూడా భయం పోయింది. చస్తే తన కష్టాలన్నీ గట్టెక్కుతాయనుకున్నాడు. యుద్ధంలో ఆరితేరినవాడు కావటంచేత పోరాడుతూ ప్రాణాలు విడవాలన్న కోరికమాత్రం అతనికి గాఢంగా కలిగింది. అతను డన్సినేన్ దుర్గానికి వెళ్లి తనపైకి దండెత్తివచ్చే మాల్‌కోమ్, మాక్‌డఫ్‌ల కోసం ఎదురుచూడసాగాడు.

ఒకనాడు నౌకరొకడు వచ్చి మాక్‌బెత్‌తో, "మహారాజా, వింత ఏమని చెప్పను?



బర్నామ్ అడవి మనకేసి కదిలి వస్తున్నది!" అన్నాడు. మాక్‌బెత్ ఈమాట విని నిర్ఘాంత పోయి ఈ అసంభవం ఎలా సంభవమయిందో చూడటానికి బయటికి వచ్చాడు.

జరిగిన దేమంటే, తమ బలాలు ఎంత ఉన్నదీ మాక్‌బెత్‌కు తెలియరాకుండా ఉండాలనే ఉద్దేశంతో మాల్‌కోమ్ తన సైనికులతో, "మీరు ఈ అడవిలో చెట్ల కొమ్మలు నరికి వాటిని పట్టుకుని దుర్గంకేసి నడవండి!" అని హెచ్చరించాడు. సైనికులు అలాగే చేశారు.

మనుషులు కనిపించకుండా అరణ్యం కదిలి వస్తూండటం చూడగానే మాక్‌బెత్ దయ్యాల జోస్యం నిజం కాబోతున్నదనీ, తన ఆట కట్టయిందనీ తెలుసుకున్నాడు.

త్వరలోనే మాక్‌బెత్ వెంటఉన్న కొద్ది పాటి బలాలకూ, మాల్‌కోమ్ తెచ్చిన సేనలకూ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో మాక్‌డఫ్, మాక్‌బెత్‌ను వెతుక్కుంటూ వచ్చి, అతడిని నానా మాటలూ అని యుద్ధానికి సవాలుచేశాడు.

మాక్‌బెత్ అతనితో యుద్ధం చెయ్యనిరాకరిస్తూ, "నువ్వు నన్ను గెలవలేవు. నన్ను చంపగలవాడు ఆడది ప్రసవించని వాడుగా ఉండాలి," అన్నాడు.

"నన్ను ఏ ఆడదీ ప్రసవించలేదు. నన్ను నా తల్లి గర్భం నుంచి నెలలునిండకముందే బలాత్కారంగా తీశారు. అందుచేత నీ మృత్యుదేవతను నేనే!" అన్నాడు మాక్‌డఫ్.

మాక్‌బెత్‌కు ఇప్పటికి కళ్ళు విచ్చుకున్నాయి. అతను మాక్‌డఫ్‌తో యుద్ధంచేసి ప్రాణాలు వదిలాడు.

కాలక్రమాన బాంకో సంతతివారు స్కాట్‌లాండ్‌కు రాజులయారు. వారిలో అఖరు వాడైన ఆరవ జేమ్స్ స్కాట్‌లాండ్‌తోబాటు ఇంగ్లాండుకు కూడా రాజు కావటంవల్ల ఆనాటినుండీ ఆ రెండు దేశాలూ ఏకచ్ఛత్రం కిందికి వచ్చాయి.





# అమూల్యమైన ఆస్తి

పూర్వం విక్రమసేనుడనే రాజు అమరావతీ నగరానికి రాజుగా ఉండేవాడు. ఆయనకు తన చుట్టూ ఉండే అధికారులపైన కొంచెం కూడా ఆదరం ఉండేదికాదు. ఎందుకంటే వారు ఎంతసేపూ, "తమరు ఇంద్రులు, చంద్రులు! తమ పరిపాలనలో ప్రజలు స్వర్గసుఖాలు అనుభవిస్తున్నారు!" అని ఇచ్చకాలు పలుకుతూ ఉండేవారు. ఈ ధోరణి ఆయనకు నచ్చేదికాదు.

అందుచేత విక్రమసేనుడు అప్పుడప్పుడూ మారువేషం ధరించి మామూలు మనిషిలాగా పల్లెటూళ్లవెంట తిరుగుతూ, సామాన్య ప్రజలు ఎలా జీవిస్తున్నారో, వారి కష్టసుఖాలేమిటో స్వయంగా తెలుసుకుంటూ ఉండేవాడు. ఆయనకు తాను తినే రాజ భోజనంకంటె గుడిసెలలోవాళ్లు తినే సామాన్యపు భోజనమే రుచికరంగా ఉన్నట్టు కూడా తోచేది.

ఒకనాడు విక్రమసేనుడు మారువేషంలో ఒక అడవిమధ్యగా వెళుతూండగా ఎవరో వేణువు ఊదటం వినిపించింది. రాజు ఆ పాట వచ్చిన దిక్కుగా వెళ్లి ఒక గొర్రెల కాపరిని చూశాడు. వాడికి పదహారేళ్లుంటాయి. చింకిబట్టలు ధరించినా మనిషి అందంగా ఉన్నాడు. వాడి అందచందాలు చూసి రాజు ఆశ్చర్యపడి, తనలాగే వాడు కూడా మారువేషంలో ఉన్న ఏ రాజకుమారుడో అనుకున్నాడు. కాని ఆయన ఆ కుర్రవాడితో సంభాషించి వాడి తల్లిదండ్రులు చాలా పేదవారని తెలుసుకున్నాడు.

ఆ గొర్రెలకాపరి పేరు సాంబుడు. వాడు రాజుగారి ప్రశ్నలకు సూటిగా సమాధానాలిచ్చాడు. వాడికి కపటంగా మాట్లాడటం ఏమాత్రం చేతకాదు. వాడి మాటలలో అమాయికత్వమూ, మంచితనమూ ఉట్టిపడుతున్నాయి.

ఎస్. సుందరరావు



"సాంబా, నా వెంట వస్తావా? నీకు మంచి బట్టలిచ్చి, భోజనంపెట్టి ఉద్యోగం ఇస్తాను!" అన్నాడు రాజు.

సాంబుడు సరేనన్నాడు.

అమరావతీనగరం చేరి రాజభవనంలో అడుగుపెట్టాక, తనను తెచ్చినది తమ దేశపు రాజుగారేనని సాంబుడికి తెలియవచ్చింది. రాజుగారికి తనపై అంత అనుగ్రహం కలిగినందుకు వాడు సంతోషించాడు.

సాంబుడి గొర్రెలకాపరి దుస్తులు తీసివేసి రాజోచితమైన దుస్తులూ, రత్నాలు పొదిగిన తలపాగా ఇచ్చారు. వాడికి రాయటమూ, చదవటమూ, సభలో మసులుకోవటమూ నేర్పారు. కొద్దికాలం గడిచాక రాజుగారు సాంబుణ్ణి తన ఖజానాదారుగా వేసుకున్నాడు. అనేక కోట్ల విలవచేసే ఆ ఖజానాకు అధికారిగా ఉండటానికి సాంబుడికన్న నమ్మకస్థుడు దొరకడని రాజుగారు భావించాడు.

ఈ ఉద్యోగంలో చేరకమునుపు సాంబుడు రాజుగారి అనుమతితో తన గ్రామానికి వెళ్లి తాను తిరిగిన చోట్లన్నీ మళ్ళీ తిరిగాడు, వేణువు ఊదాడు. తరవాత తనవారందరికీ వాడు కానుకలు ఇచ్చాడు. "రాజుగారి కొలువు ఎలా ఉంది?" అని తనవారు అడిగితే, "మీరు ఈ గ్రామాన్నివదిలి ఎక్కడికీ వెళ్లకండి! రాజదివాణాలలో అసలే ఉద్యోగాలు చేయకండి! నిజమైన సుఖం ఇక్కడే ఉన్నది!" అని సలహా ఇచ్చాడు.

తరవాత వాడు అమరావతికి తిరిగివెళ్లి రాజుగారి ఖజానాదారుగా పని ప్రారంభించాడు.

కొంతకాలానికి రాజుగారు చనిపోయాడు. రాజుగారి కొడుకు కనకసేనుడు సింహాసనం ఎక్కాడు. రాజుగారి అధికారులలో చాలా మందికి సాంబుడంటే పడేదికాదు. ఎందుకంటే చనిపోయిన రాజుగారు వాణ్ణి తమ అందరికన్న ఎక్కువ ఆదరంతో చూసేవాడు.

ఇప్పుడు ఈ అధికారులందరూ కొత్త రాజు చుట్టూ చేరి, "మహారాజా, మీనాన్న గారి అండచేరి ఈ సాంబుడు మీ ఖజానాను కొల్లగొట్టేశాడు. వాణ్ణి ఒక కంట కనిపెట్టటం మంచిది!" అన్నారు.

తన అధికారులు తన క్షేమంకోరి ఏదైనా చెబితే రాజైనవాడు వినకుండా ఎలా ఉండ గలడు? "సాంబుడి ద్రోహం బయటపడే ఉపాయం చెప్పండి. అతన్ని తప్పక శిక్షిస్తాను," అన్నాడు కనకసేనుడు.

"మీ తాతగారివద్ద రత్నాలు తాపిన పిడి గల కత్తి ఉండేది. దాన్ని తెచ్చి తమకు చూపమనండి!" అని కుట్రదారులు రాజుకు సలహా ఇచ్చారు.

రాజు సాంబుణ్ణి పిలిపించి, "మా తాత గారి కత్తి నీ అధీనంలో ఉన్నదట. దాన్ని ఒకసారి తెచ్చి నాకు చూపించు!" అన్నాడు.

"మహారాజా, ఆకత్తి పిడినుంచి రత్నాలు తీయించి తమ తండ్రిగారు ఆభరణాలు చేయించారు," అన్నాడు సాంబుడు.

సాంబుడు చెప్పిన మాట నిజమేనని రుజువయింది. ఎందుకంటే సాక్షులు చాలా మంది దొరికారు.

"సాంబుడు నిర్దోషిగా కనిపిస్తాడు!" అన్నాడు రాజుగారు కుట్రదార్లతో.



"మహాప్రభూ, ఖజానాలో ఉన్న వస్తువు లన్నిటి జాబితావేసి తీసుకురమ్మనండి. పాత జాబితాలతో పోల్చి ఏ వస్తువులున్నాయో, ఏవేవి పోయాయో తెలుసుకోవచ్చు!" అన్నారు కుట్రదార్లు.

రాజుగారి ఆజ్ఞప్రకారం సాంబుడు తన అధీనంలో ఉన్న అన్ని వస్తువులనూ జాబితా వేసి తెచ్చాడు. జాబితా చూస్తే వస్తువు లేవీ పోయినట్టు కనపడలేదు. వాడువేసిన జాబి తాలోని వస్తువులను తణిఖీచెయ్యటానికి రాజుగారు సపరివారంగా ఖజానాకు వెళ్లారు.

ఖజానా చూస్తుంటే రాజుగారికి పరమా నందమయింది. అందులో వస్తువులన్నీ

ఎంతో అందంగా, నేర్పుగా అమర్చి ఉన్నాయి. జాబితానుబట్టి వాటిని సరి చూడటం చాలా సులువుగా జరిగిపోయింది.

రాజుగారు వెళ్లిపోవటానికి ముందుగా సాంబుణ్ణి ప్రశంసించబోతూండగా ఆయన వెంటఉన్న అధికారులలో ఒకడు ఖజానా గోడలోని చిన్న ఇనప తలుపుచూసి, "గోడలో ఏదో సొరుగు ఉన్నట్టున్నది. అందులో ఏమున్నదో?" అన్నాడు.

రాజుగారు సాంబుడికేసి తిరిగి, "ఆ సొరుగులో ఏమి వస్తువులున్నాయి? వాటిని ఈ జాబితాలో ఎందుకు చేర్చలేదు?" అని అడిగాడు.

"మహారాజా, మన్నించండి! ఆ సొరుగులో ఉన్నది నా సొంత ఆస్తి! అది నాకు అమూల్యమైనది! అందుచేత దానిని మీ జాబితాలోచేర్చలేదు!" అన్నాడు సాంబుడు.

ఈమాటలు వినగానే, కుట్రదారులు సాంబుణ్ణి గురించి చెప్పిన చాడీలన్నీ రుజువయినట్టే రాజుగారికి అనిపించింది. ఆయన కోపంతో, "ముందు ఆ సొరుగు తలుపు తెరు!" అన్నాడు.

సాంబుడు ఇనప తలుపు తెరిచాడు. దాని వెనకగోడలో ఉన్న సొరుగులో ఒక గొర్రెలకాపరి కంబళీ, పాతచెప్పులూ, ఒక వేణువూ మాత్రమే కనిపించాయి.

రాజుగారు నిర్ఘాంతపోయి, "ఇదేనా నీ అమూల్యమైన ఆస్తి?" అని అడిగాడు.

"అవును, మహారాజా! నేను మీతండ్రి గారి కొలువులో చేరకమునుపు నాకున్న ఆస్తి అదే. కొలువులో చేరాక నా మనసు సుఖమన్నది ఎరగదు. నేను సుఖపడింది, ఆ ఆస్తి ఉన్నంతకాలమే!" అన్నాడు సాంబుడు.

రాజుగారు సాంబుడి మాటలతో మంచి గుణపాఠం నేర్చుకున్నాడు. ఆయన సాంబుణ్ణి తన తండ్రికన్నకూడా ఎక్కువగా ఆదరించి, వాడిమీద చాడీలు చెప్పినవారి నందరినీ కొలువులోనుంచి తొలగించేశాడు.



# చిక్కిపోయిన దొంగ



# వినోదాలు

న్యాయవాది: (ఫిర్యాదితో) మీ సైకిలు ఎత్తుకుపోయిన మనిషి ముద్దాయేనని మీరు రూఢిగా చెప్పగలరా?

ఫిర్యాది: అయ్యా, ఇంతకు ముందైతే చెప్పగలిగేవాణ్ణి. కాని మీరు ఇన్ని ప్రశ్నలు వేశాక అసలు నాకు సైకిలుండేదా అని అనుమానం కలుగుతోంది.

*   *   *

ఉపాధ్యాయుడు: భూభారాన్ని మోస్తున్నదెవర్రా, గోపీ?

గోపీ: ఆదిశేషువు.

ఉపా: ఆదిశేషువును ఎవరు భరిస్తున్నారు?

గోపీ: ఆదికూర్మం.

ఉపా: ఆదికూర్మాన్ని భరించేది?

గోపీ: డబ్బుగల మామగారై ఉంటాడు.

*   *   *

ఒకరోజు సాయంకాలం వేణు గోపాలుణ్ణి చూడబోయాడు. వాన వచ్చింది. వేణు ఇంటికి బయలుదేరుతూంటే గోపాలుడి తల్లి, "మా గోపాలుడి గొడుగు వేసుకుని వెళ్ళు, నాయనా!" అన్నది.

"ఎందుకులెండి?" అన్నాడు వేణు.

"అదేమిటి, నాయనా? మా గోపాలుడు మీ ఇంట వానలో చిక్కుకు పోతే, మీ అమ్మ వాడికి గొడుగిచ్చి పంపదా?" అన్నది గోపాలుడి తల్లి.

"మా అమ్మయితే, మీవాడికి ఈ పూటకు మా ఇంట్లోనే భోజనం పెట్టి పడుకోనిచ్చేది!" అన్నాడు వేణు.

*   *   *

"మీరూ మీభార్యా కూడా హిందీ నేర్చుకుంటున్నారటగా?"

"అవునండీ! మేం ఉత్తరాది పిల్లవాణ్ణి పెంచుకుంటున్నాం. వాడు మాటలు వచ్చి మాట్లాడటం మొదలుపెడితే వాడి మాటలు మాకు తెలియవద్దూ? అందుకని హిందీ నేర్చుకుంటున్నాం!"

*   *   *

"నిఘంటువులు ఎలా రాస్తారో?"

"ఆడవాళ్ళు పోట్లాడుకున్నట్టే! మాటమీద మాట వచ్చేస్తుంది."

*   *   *

"విన్నారా? చైనాలో పెళ్లికి ముందు భార్యా భర్తలు ఒకరినొకరు ఎరగరుట!"

"విదేశంలో మటుకు?"



# అహింసాజ్యోతి

## [ 5 ]

తపస్యుడు, భల్లుకుడు అనే ఇద్దరు అన్నదమ్ములు వర్తకంకోసం ప్రయాణం చేస్తూ అయిదువందల బళ్లపై సరుకు వేసుకుని కిరిపాలువనంకేసి వచ్చారు. ఒక చోటికి వచ్చేసరికి బళ్ల చక్రాలు ఇరుసులదాకా భూమిలో దిగబడిపోయాయి, ఎద్దులు మోకాటి తండాలు వెయ్యవలిసివచ్చింది.

ఇదేదో దైవమాయ అనుకుని ఆ సోదరులు ధూపదీపాలతో దేవతలను ఆరాధించారు. ఈ సమయంలో వారికి ఆ వనంలో బుద్ధుడు కనిపించాడు. వారాయనకు తేనె ఆహారంగా ఇచ్చారు. బుద్ధత్వం పొందినాక నలభైతొమ్మిది రోజులు ఉపవాసం ఉండి ఆయన పుచ్చుకున్న ఆహారం ఇదే.

బుద్ధుడు ఆ సోదరులకు మూడు నియమాలు బోధించి వారిని ఉపాసకులుగా చేశాడు. ఈలోపుగా వారిబళ్లు భూమినుంచి బయటపడ్డాయి. వారు ప్రయాణం సాగిస్తూ, "స్వామీ, తమ జ్ఞాపకార్థం మాకు ఏమైనా ఇవ్వండి!" అని అడిగారు. బుద్ధుడు తన కుడిచెయ్యి ఎత్తి తన తలమీది కేశాలు తీసి ఇచ్చాడు. వారు వాటిని ఒక పేటికలో పెట్టి తమవెంట తీసుకుపోయారు.

ఆ సోదరులు కాలక్రమాన సముద్ర తీరం చేరి తమ సరుకులను ఒక నావలోకి ఎక్కించుకుని సముద్రయానం సాగించారు. కొంతకాలానికి వారు సింహళం చేరుకున్నారు. అక్కడ వారికి వంటచెరుకూ,




మంచినీరూ కావలిసిరావటంవల్ల వారు నావను ఒక రేవుకు చేర్చి, ఒడ్డుకు వెళ్లి వంటపని ప్రారంభించారు. ఆ సమయంలో బుద్ధుడి కేశాలు గల పేటికను వారొక రాతి పైన ఉంచారు.

వారు తమ భోజనాలు ముగించుకుని తిరిగి ప్రయాణం సాగించేటప్పుడు పేటికను తీయబోతే, అది రాతికి అంటుకుపోయి ఊడి రాలేదు. అందుచేత వారా పేటిక చుట్టూ పూలూ, దీపాలూ అమర్చి నావలో తమదారిన తాము వెళ్లిపోయారు. మరి కొంతకాలానికి ఆ పేటిక ఉండిన చోట గిరిహందువిహారం నిర్మించబడింది.



బుద్ధుడు తాను ప్రచారం చెయ్యవలిసిన ధర్మాన్నిగురించి చాలా దీర్ఘంగా యోచించాడు. మనుషులు పాపపంకిలంలో పొర్లుతున్నారు. వారికి సత్యం అణుమాత్రమైనా తెలియదు. వారు తన మాటలను విని, నిజం తెలుసుకుని, సరిగా జీవించేది ఎలా? ఈ విషయమై బుద్ధుడు ఆలోచించాడు.

ఆయన తాను బుద్ధత్వం పొందిన అరవై రోజులకు కాలినడకను ఒంటరిగా ఇసిపతనం అనే చోటికి బయలుదేరాడు. ఇది 288 మైళ్ల దూరాన వారణాసికి సమీపంలో ఉన్నది. దారిలో ఉపకుడు అనే యాచకుడు తగిలాడు. బుద్ధుడి రూపమూ, వర్చస్సూ చూసి ఉపకుడు నిర్ఘాంతపోయి, "స్వామీ, నీవు బ్రహ్మవా, ఇంద్రుడివా?" అని అడిగాడు.

"నేను బ్రహ్మనూ కాను, ఇంద్రుణ్ణీ కాను. జన్మపరంపర ఎందుచేత కలుగుతుందో, దానినుంచి విముక్తి పొందట మెలాగో తెలుసుకుని, విసర్జించవలిసినదంతా విసర్జించి, సేకరించవలిసినదంతా సేకరించిన బుద్ధుణ్ణి, నా పేరు అనంతజినయుడు," అన్నాడు బుద్ధుడు.

కొంత దూరంపాటు బుద్ధుడివెంట నడిచి ఉపకుడు వంగదేశం వెళ్లిపోయాడు. అక్కడ





అతను ఒక స్త్రీని పెళ్లాడి, సంసారలంపటంలో కొంతకాలం పడరాని పాట్లు పడి, తరవాత బుద్ధుణ్ణి వెతుక్కుంటూ ఇసిపతనం వెళ్లి అక్కడ బౌద్ధుడయిపోయి తరించాడు.

ఉపకుణ్ణి కలుసుకున్న రోజు సాయంకాలమే బుద్ధుడు ఇసిపతనవిహారం చేరుకున్నాడు. ఉరువేలవనంలో ఆయనకు కొంతకాలంపాటు శిష్యులుగా ఉండి, ఆయనయందు విశ్వాసం పోగొట్టుకుని, వెళ్లిపోయిన కౌండిన్యుడు మొదలైన తాపసులు ఈ విహారంలోనే ఉంటున్నారు.




అంతదూరాన ఉండగానే వారు బుద్ధుణ్ణి చూసి, "అతనుకూడా ఇక్కడికే వస్తున్నాడు. అతని శరీరం చూడండి, బుసబుసలాడుతూ, బంగారంలాగా వెలిగిపోతూ ఎలా ఉన్నదో. పుష్కలంగా భోజనంచేస్తున్నట్టున్నాడు. బుద్ధత్వంకోసం ప్రయత్నించటం మానుకున్నాడు కాబోలు. అతను వస్తే మనతోబాటు కూచోనిద్దాం, కాని మనం లేవవలిసిన పనిలేదు," అనుకున్నారు.

అయినప్పటికీ బుద్ధుడు తమవద్దకు వచ్చేసరికి వారు తమ తీర్మానాన్ని మరిచిపోయి లేచి నిలబడ్డారు; ఆయనకు అర్ఘ్యపాద్యాలిచ్చి కుశలప్రశ్నలు చేశారు.

ఆ సాయంకాలమే బుద్ధుడు ఆ విహారంలో తన తొలిబోధ చేశాడు. ఆచార్యులు కాదలిచినవాళ్లు పాపపూరితమైన కోరికలను విసర్జించాలనీ, బ్రాహ్మణ తాపసుల లాగా కఠోరమైన వ్రతాలుకూడా మానాలనీ ఆయన హెచ్చరించాడు. ఆయన మగధ దేశపు భాషలో అందరికీ అర్థమయేలాగ సంభాషించాడు.

ఈ ఉద్బోధ ఫలితంగా అయిదుగురు బ్రాహ్మణులలో పెద్దవాడైన కౌండిన్యుడు బుద్ధుడి శిష్యుడయాడు.

బుద్ధుడు ఇసిపతనంలో ఉండగా ఆయన వద్దకు అనేకమంది వచ్చి శిష్యులయారు.



ఇలా వచ్చినవారిలో సుజాత కొడుకు యశుడనేవాడు ఒకడు. యశుడు ఒకరాత్రి రహస్యంగా బుద్ధుడివద్దకు వచ్చాడు. బుద్ధుడు ఎంతో ప్రేమతో అతనిని చేరదీసి తన శిష్యుడుగా చేసుకున్నాడు. తన కొడుకు ఇలా చేశాడని సుజాత భర్త చాలా ఖిన్నుడయాడు. బుద్ధుడు ఆయనకుకూడా తత్వోపదేశం చేసి తన అనుచరులలో చేర్చుకున్నాడు. యశుడితో ఆడుకునే యాభైనలుగురు పిల్లలు యశుడి మనసు మార్చటానికిగాను ఆరామానికి వచ్చారు. బుద్ధుడు వారితో కూడా మాట్లాడి వారిని తన అనుచరులలో చేర్చుకున్నాడు.



ఇప్పుడు బుద్ధుడి శిష్యులలో అర్హతుల శ్రేణికి చెందినవారు అరవైమంది ఉన్నారు. వారితో బుద్ధుడు, "మీరంతా వేరువేరు మార్గాల అన్ని దిక్కులకూ వెళ్లి బుద్ధుడు అవతరించాడని ప్రజలకు చాటండి!" అన్నాడు. అర్హతులు ప్రయాణమై వెళ్లాక బుద్ధుడు ఉరువేలవనానికి బయలుదేరాడు. మధ్యదారిలో నాలుగు దారులు కలిసేచోట ఒక చెట్టునీడను విశ్రమించాడు. ఆ సమయంలో అక్కడికి ముప్ఫైరెండుమంది క్షత్రియకుమారులు వచ్చారు.

వీరు భద్రవర్గులనబడే ఉత్తమ జాతి క్షత్రియులు, కోసలదేశానికి చెందినవారు. కోసలరాజు వీరికొక పరగణా ఇచ్చి దానిని సమిష్టిగా పరిపాలించమని చెప్పాడు. ఒక నాడు వారందరూ తమతమ స్త్రీలను వెంట బెట్టుకుని కప్రశిక అనే ఒక రమణీయ ప్రదేశం చూడటానికి వచ్చారు. ఆ ముప్పై ఇద్దరిలోనూ ఒకడివెంట ఉండిన స్త్రీ అతని భార్యకాదు, ఉంపుడుగత్తె. ఆమె అతని ఆభరణాలన్నీ దొంగిలించి పారిపోయింది. ఆమెను వెతుకుతూ రాజకుమారులందరూ బుద్ధుడు విశ్రమించిన చోటికి వచ్చారు.

బుద్ధుడు వారి కథ అంతా విని, "మీరు ఇతరులకోసం అన్వేషించటం మంచిదా,




"మిమ్మల్ని మీరే అన్వేషించుకోవటం మంచిదా ?" అని అడిగాడు.

అయన ఉద్దేశం అర్థమై క్షత్రియులు, ఎవరిని వారు అన్వేషించుకోవటమే మంచి దని ఒప్పుకున్నారు.

బుద్ధుడు వారి మాటలకు సంతోషించి వారికి తత్వం ఉపదేశించి, అర్హతులనుచేసి, వారినికూడా దేశాలమీద పంపాడు. వీరితో ప్రచారకుల సంఖ్య 92 కు పెరిగింది.

బుద్ధుడు ఉరువేలవనానికి తిరిగి వచ్చాక ఆయనకు ఒక విషయం తెలిసింది. ఆ సమీపంలో ఒక నది ఒడ్డున ఉరువేల కాశ్యపుడూ, గయా కాశ్యపుడూ, నదీ



కాశ్యపుడూ అనే ముగ్గురు అన్నదమ్ములు మహావైభవంగా జీవిస్తూ, సౌఖ్యాలలో ఓల లాడుతూకూడా తాము అర్హతులమని చెప్పు కుని ప్రజలను వంచిస్తున్నారు. పెద్దవాడికి 500 మంది శిష్యులూ, రెండోవాడికి 300 మంది శిష్యులూ, మూడోవాడికి 200 మంది శిష్యులూ ఉన్నారు. ఈ వెయ్యిమందికీ ప్రబోధం ఇచ్చి సన్మార్గంలో పెట్టాలని బుద్ధుడు నిశ్చయించాడు.

ఆయన ఒక సాయంకాలం ఉరువేల కాశ్యపుడి ఇంటికి వెళ్ళి, ఆ రాత్రికి తనను అగ్నిగృహంలో ఉండనిమ్మని కోరాడు.

"నాకేమీ అభ్యంతరం లేదు. కాని అగ్ని గృహంలో ఒక విషసర్పం ఉన్నది. మేము అర్హతులము గనక మా అన్నదమ్ములనూ, మా శిష్యులనూ అది ఏమీచేయలేదు. కాని నీబోటి అర్హతుడు కానివాడు దాని విషానికి మాడిపోతాడు," అన్నాడు ఉరువేలుడు.

బుద్ధుడు ఈ మాటలు వినపడనట్టు, "నన్ను దయచేసి అగ్నిగృహంలో పడుకో నివ్వండి !" అన్నాడు.

"విషసర్పం ఉందని చెప్పాను. కావలిస్తే పడుకో !" అన్నాడు ఉరువేలుడు.

ఆ రాత్రి బుద్ధుడు పడుకున్నచోటికి విష సర్పం రానేవచ్చింది. బుద్ధుడు దాన్ని అవ





లీలగా లోబరుచుకుని, దాని విషం పిండేసి, దాన్ని తన భిక్షాపాత్రలో పెట్టుకున్నాడు.

మర్నాడు కాశ్యపసోదరులు బుద్ధుడి భిక్షాపాత్రలో చుట్టచుట్టుకుని పడుకుని ఉన్న పామును చూసి నిర్ఘాంతపోయారు. వారు బుద్ధుడితో, "నీవు విషసర్పాన్ని లోబరుచుకున్నంతమాత్రాన అర్హతుడివై పోలేదులే!" అన్నారు.

తరవాత బుద్ధుడు ముగ్గురు కాశ్యపులనూ, వారి వెయ్యిమంది శిష్యులనూ ప్రబోధించాడు. వారందరూ ఆయన శిష్యులై అర్హతుల శ్రేణిలో చేరిపోయారు.

తనకు బుద్ధత్వం లభించినట్టయితే రాజగృహానికి వచ్చి ప్రజలకు ఉపదేశం చేస్తానని సిద్ధార్థుడు బింబిసారుడికి మాట ఇచ్చిఉన్నాడు. అందుచేత ఇప్పుడు బుద్ధుడు బయలుదేరి వెళ్లి రాజగృహానికి పన్నెండు మైళ్లదూరాన ఉన్న యష్టివనంలో ఒక చెట్టుకింద కూచున్నాడు. బుద్ధుడి వెంట ఉరువేల కాశ్యపుడుకూడా ఉన్నాడు.

బుద్ధుడు యష్టివనంలో విశ్రమించిన వార్త అటవికులద్వారా బింబిసార మహారాజుకు తెలియవచ్చింది. ఆయన ఒక లక్ష ఇరవైవేలమంది అనుచరులతో బయలుదేరి బుద్ధుడున్న చోటికి వచ్చాడు.



బింబిసారుడి అనుచరులు ఉరువేల కాశ్యపుడు గొప్ప సిద్ధుడని ఎరుగుదురు. వారిప్పుడాయనను బుద్ధుడి వెంట చూసి, వారిద్దరిలో ఎవరు గురువో, ఎవరు శిష్యుడో ఊహించలేకపోయారు. వారి సందేహానికి సమాధానంగా ఉరువేలుడు, "అయ్యాలారా, బుద్ధుడు సూర్యుడు. ఆయనముందు నేనొక మిణుగురు పురుగును!" అన్నాడు.

ఆ సమయంలో బుద్ధుడు అక్కడ చేరిన వారికి మొట్టమొదటి జాతక కథ చెప్పాడు. దాని సారాంశమేమంటే:

ఉరువేలుడు ఒక పూర్వజన్మలో అంగాతి అనే మిథిలానగరపు రాజు



ఆయనకు రుచా అని ఒక కుమార్తె ఉండేది. అంగాతి క్షుద్ర సిద్ధాంతాలు తలకు పట్టటం చేత, మరణానంతరం జీవికి వేరే లోకాలు లేవనీ, ప్రాణి చనిపోగానే శరీరం పంచ భూతాలలో లీనమైపోతుందనీ, అందుచేత అనుభవించేదంతా ఈ జన్మలోనే అనుభవించాలనీ భావించాడు. ఆయన కుమార్తె రుచా పుణ్యకార్యాలకు ద్రవ్యం అడిగితే ఇవ్వ నిరాకరించాడు. అప్పుడు మహా బ్రహ్మగా ఉంటున్న బోధిసత్వుడు ఆయన వద్దకు వచ్చి, "నీకుమార్తె పుణ్యకార్యాలకు డబ్బు ఇవ్వరాదా?" అన్నాడు.

"నా కుమార్తెకు కావలిసిన ద్రవ్యం ఇప్పుడు మీరివ్వండి. నేను చనిపోయాక ఆ బాకీ పదింతలుగా తిరిగి ఇస్తాను. నేను ఇంత రాజ్యానికి రాజునుకదా. మీ సొమ్ము ఎక్కడికీ పోదు" అన్నాడు అంగాతి.

దానికి బోధిసత్వుడు, "ఓయి, వెర్రివాడా! నీవు ఇప్పుడు రాజువేగాని చనిపోయినాక నీకు గోచిపాతకూడా ఉండదు. తినటానికి తిండికూడా ఉండదు. నువు నరకంలో ఉండి పడరాని పాట్లన్నీ పడతావు. అటువంటి స్థితిలో నా బాకీ ఎలా తీర్చగలుగుతావు. అందుచేత నేను నీకు అప్పుపెట్టను," అన్నాడు.

ఈ మాటలతో అంగాతి హడలిపోయి తన మనసును మార్చుకుని పుణ్యం సంపాదించుకున్నాడు.

ఈ జాతక కథ చెప్పినాక బుద్ధుడు తన ఉపదేశం వినటానికి వచ్చినవారందరినీ, బింబిసార మహారాజునూ తన శిష్యులుగా చేర్చుకున్నాడు. బింబిసారుడు రాజ్యాభిషేకం చేసుకునేనాటికి పదహారేళ్ళవాడు. బుద్ధుడి శిష్యుడయేనాటికి ఆయన వయసు ఇరవైతొమ్మిది ఏళ్లు. అది మొదలుకొని ముప్పై ఆరేళ్లపాటు ఆయన జీవితం బుద్ధుడికి తోడ్పడటంలో గడిచింది.

(ఇంకా వుంది)





# దక్షిణ ధ్రువ ప్రాంతపు వింతలు



## 2

తిమింగిలాల శాఖలోని రేవులో నౌకలు లంగరువేశాయి. తీరాన ఒక శిబిరం నెలకొల్పారు. అక్కడే విమానాలు దిగటానికి అనువుగా మంచులో ఒక విమాన మార్గం నిర్మించారు.

తిమింగిలాల శాఖకు ఒక నియమితమైన స్వరూపం లేదు. అంటార్కిటికా ఖండం మధ్యప్రాంతంనుంచి రెండు మంచుపీటలు ఈ శాఖలోకి పరుచుకుని ఉన్నాయి. ఆ రెండు పీటలలో ఒకటి, "రాస్ షెల్ఫ్." దీని విస్తీర్ణం 1,60,000 చదరపు మైళ్లు. ఇంత మేరా 500 లగాయతు 800 అడుగుల మందం గల మంచున్నది. ఈ మంచుపీట కోట్లానుకోట్ల టన్నుల బరువు గలది. ఈ బరువువల్ల ఏర్పడిన ఒత్తిడి ఫలితంగా, అప్పడాలకర్ర ఒత్తిడికి అప్పడం విస్తరించిన విధంగా ఈ మంచుపలక ఉత్తరంగా రోజుకు నాలుగు అడుగుల చొప్పున తోసుకు వస్తుంది. (మంచునదులుకూడా అతి నింపాదిగా, అంగుళం అంగుళమే ముందుకు జరుగుతాయి; అవి వ్యాపించటానికికూడా మంచు ఒత్తిడే కారణం.)

రెండవ పలకను "ప్రెస్ట్రూడ్ షెల్ఫ్" అంటారు. ప్రెస్ట్రూడ్ అనే నార్వేదేశపు నౌకాశాఖాధికారి మొట్టమొదటగా ఆ పలకపైన ప్రయాణంచేయటంవల్ల దానికి ఆయన పేరు ఉంచారు. ఈ పలకతాలూకు వాయువ్యకోణం తిమింగిలాల శాఖలోకి చొచ్చుకువస్తుంది. అదికూడా రోజుకు నాలుగు అడుగుల చొప్పున పడమటి దిక్కుగా విస్తరించుతున్నది.

ఈ రెండు మంచుపీటల విస్తరణవల్లా సముద్రశాఖ క్రమంగా మూసుకుపోతుంది. చివరకు రెండు పీటలూ ఒకదాన్ని ఒకటి



తాకి విపరీతమైన శక్తితో ఒరుసుకుంటాయి. అప్పుడు తిమింగిలాలదీవి పూర్తిగా అదృశ్యమైపోతుంది; రాస్ సముద్రంమీద అడ్డంగా మంచుగోడ గోచరిస్తుంది. ఈ గోడనుండి బ్రహ్మాండమైన మంచుపెళ్లలు విరిగి నీటిలో పడి, తేలుతూ కదులుతాయి. ఒక్కొక్కసారి 800 చదరపుమైళ్ల వైశాల్యం గల మంచుపలకలు ఈ గోడనుంచి వేరుకావటం కద్దు. బర్డ్ వెంట వచ్చినవారు 20 మైళ్ల నిడివిగల పలకలను నీటిలో తేలుతుండగా చూశారు. ఇలా మంచుముక్కలు విరిగి నీటిలో తేలిపోనారంభించగానే మళ్లీ సముద్రశాఖ బయటపడుతుంది.

1941 లో బర్డ్ ఈ ప్రాంతాలకు వచ్చినప్పుడు పరిశోధకుల నిమిత్తం నివాసం నిర్మించటం జరిగింది. ఇప్పుడది పూర్వం ఉండిన చోట లేక వాయువ్యమూలగా సుమారు మైలున్నర దూరం జరిగి ఉన్నది. మంచు తవ్వి నేలమట్టానికి కప్పు ఉండేలాగు నిర్మించిన గదులు నాలుగు అడుగుల లోతున ఇప్పుడు కనిపించాయి. గోడలకూ, కప్పుకూ పట్టుకుని మంచు బూజులాగా ఉన్నది. ఆరేళ్లక్రితం అక్కడ వదిలిపోయిన ఆహారపదార్థాలన్నీ చెక్కుచెదరకుండా, తినటానికి యోగ్యంగా ఉన్నాయి!

దీనికి "లిటిల్ అమెరికా" అని పేరు. ఇక్కడ రేడియో స్తంభాలుకూడా ఏర్పాటై ఉన్నాయి.

దక్షిణధృవంచుట్టూ ఉండే పీఠభూమినీ, కొండలచరియలనూ విమానాల సహాయంతో పరిశోధించటానికే బర్డ్ ఇప్పుడు ఈ ప్రాంతానికి వచ్చాడు. అందుకు తగిన ఏర్పాట్లన్నీ త్వరలోనే పూర్తి అయాయి.

ఇందుకుగాను జోడు ఇంజన్లు గల విమానాలు 6 ఉన్నాయి. ఒక్కొక్క విమానంలోనూ అయిదేసిమంది మనుషులు ఎక్కవచ్చు, ఫోటోలు తీసే పరికరసామగ్రిని వెంట తీసుకుపోవచ్చు. ఒకసారి నూనె

వేసుకుంటే ఈ విమానాలు 850 మైళ్ల దూరానికి వెళ్లి తిరిగిరాగలవు. "లిటిల్ అమెరికా" నుంచి దక్షిణధృవానికి అంత దూరంకూడా లేదు.

"ఫిలిపైన్ సీ" అనే విమానవాహక నౌక ఈ విమానాలను తెచ్చి స్కాట్ దీవిపద్ద లంగరు దించింది. ఆ నౌక లిటిల్ అమెరికాను చేరాలంటే 600 మైళ్ల మంచు సముద్రాన్ని దాటి రావాలి. అది సాధ్యం కాదు. అందుచేత విమానాలను స్కాట్ దీవినుంచి లిటిల్ అమెరికాకు గాలిలో తెచ్చారు. ఇది జనవరి 29 న జరిగింది.

దక్షిణ ధృవప్రాంత మంతటా విమానాలలో పర్యటించి ఫొటోలు తీసుకునే కార్యక్రమమంతా రెండు వారాలు మాత్రమే పట్టింది.

ప్రతి విమానంలోనూ అయిదేసి కామెరాలున్నాయి. అందుట్లో ఒకటి విమానానికీ భూమికీ ఉండే దూరాన్ని రాడార్ ప్రతిధ్వనుల సహాయంతో ఎప్పటికప్పుడు కొలుస్తుంది. మూడు కామెరాలు విమానం కింద ఉండే భూభాగాన్ని ఫొటోతీస్తాయి. అదే సమయంలో అయిదవ కామెరా గడియారాన్నీ, విమానంలో గల రకరకాల మానాలనూ ఫొటోతీస్తుంది.



భూభాగాన్ని ఫొటోతీసే కామెరాలలో మధ్య ఉండేది విమానానికి నేరుగా దిగువ నున్న భాగాన్ని ఫొటోతీస్తుంది. మిగిలిన రెండు కామెరాలూ ఈ కామెరాకు అటూ ఇటూ అమర్చి ఉండి, 30 డిగ్రీలు ఏటవాలుగా భూమిని ఫొటోతీస్తాయి. ఈ మూడు కామెరాల సహాయంతో ఒక్క విమానయాన కాలంలో ఒక లక్ష చదరపుమైళ్ల భూభాగాన్ని ఫొటోతీసే అవకాశం ఉన్నది.

పైన చెప్పిన రెండు వారాల కాలంలోనూ ఈ విమానాలు 29 యానాలు చేశాయి. ఇందులో 17 పూర్తిగా విజయవంతమయాయి, మరి 3 కొంతవరకు మాత్రమే

విజయవంతమయాయి. మిగిలిన 9 ఫలించలేదు. సుమారు 220 గంటలపాటు విమానాలు గాలిలో ఉన్నాయి. అవి నడిచిన మొత్తం దూరం 27,500 మైళ్లు.

ఈ పరిశోధనల ఫలితంగా అనేక కొత్త విషయాలు బయటపడ్డాయి. రాస్ సముద్రంలో ఎవరూ గమనించని కొత్త దీవులు ఎన్నో బయటపడ్డాయి. అంతకు పూర్వం అవి కనిపించకపోవటానికి కారణం అవి మంచుకప్పి ఉండటమే.

రాస్ సముద్రపు తూర్పుతీరం గురించి ఇంతకు పూర్వం తెలియని స్వరూప వివరాలు కొన్ని ఇప్పుడు స్పష్టమయాయి. ఈ తీరంగురించి స్పష్టంగా తెలియకపోవటానికి కారణంకూడా మంచే. నేలను కప్పిన మంచుపలక సముద్రంలోకి చాలా దూరం చొచ్చుకుపోయినప్పుడు నేల ఎక్కడ అంతమై సముద్రం ఆరంభమయేదీ తెలియరాదు.

రాస్ మంచుగోడను ఫొటో తీసేటప్పుడు ఆ గోడలోగల సముద్రశాఖలనూ, పగుళ్లనూ, సందులనూ, ముడతలనూ ఫొటోచేసి వాటిని "మాప్"లో గుర్తుపెట్టారు.

పూర్వం ఎవరూ ఎరగని 3 పర్వత పంక్తులు కనిపెట్టబడ్డాయి. ఒక పర్వత పంక్తిలో 16,000 మొదలుకొని 20,000 అడుగుల ఎత్తు ఉండే శిఖరం ఒకటి కనుగొనబడింది! అదివరకు తెలియని అనేక విడిపర్వతాలూ శిఖరాలూ, అనేక కొత్త మంచునదులూ కనుక్కోబడ్డాయి.

2 లక్షల పైచిలుకు చదరపుమైళ్ల విస్తీర్ణం గల ధృవప్రాంతం పరిశోధించబడింది. ఈ పరిశోధనలు చేసిన విమానాలు సుమారు 10 వేల అడుగుల ఎత్తున గాలిలో ఎగిరాయి. ఈ ప్రయాణంలో కనిపెట్టబడిన అతి విచిత్రమైన విషయమేమంటే, రాస్ సముద్రపు పడమటి తీరాన రెండు ప్రాంతాల మంచు లేదు! —(ఇంకా ఉంది)






ఉజ్జయినీనగర సంస్థానంలో పాకయాజి అనే మహాపండితు డొకడుండేవాడు. అయన అన్ని శాస్త్రాలూ, విద్యలూ నేర్చుకున్నాడు కాని ఇంద్రజాల విద్యమాత్రం నేర్చుకోలేదు. ఆ విద్యకూడా సంపాదించినట్టయితే తన పాండిత్యం పూర్తి అవుతుందని పాకయాజికి తోచింది.

ఉజ్జయినీ నగరంలోనే లఘుకర్ణి అనే పేరు గల ప్రసిద్ధుడైన ఇంద్రజాలికుడు ఒకడుంటున్నాడు.

పాకయాజి ఒకనాడు లఘుకర్ణి వద్దకు వెళ్లి, "అనేకమంది గురువులవద్ద నేను సకలమైన విద్యలూ నేర్చాను. కాని నాకు ఇంద్రజాలవిద్య నేర్పిన గురువు లేకపోయాడు. ఈ లోటు మీరే తీర్చాలి. నన్ను మీ శిష్యుడుగా చేర్చుకుని నాకు ఇంద్రజాలం నేర్పండి! నేను మీ రుణం ఉంచుకోను," అని అడిగాడు.

ఈమాటలు విని లఘుకర్ణి, "అయ్యయ్యో, మీరు మహాపండితులు! నాదగ్గిర శిష్యత్వం చెయ్యటమేమిటి?" అన్నాడు.

"అలా అనకండి. విద్య చెప్పినవాడు గురువు. నేను రాజుగారివద్ద కొలువుంటున్నాను గనక మీకు యథోచితమైన గురుదక్షిణకూడా ఇచ్చుకోగలను," అన్నాడు పాకయాజి.

"సరే, మీకు నా ఇంద్రజాల విద్య నేర్పటం ఆరంభిస్తాను. నాకు వేరే గురుదక్షిణ అవసరంలేదు. నాకు ఒక్కడే కొడుకున్నాడు. వాడికి నా విద్యమీద గురిలేదు. వీలు దొరికితే వాడికి రాజుగారి కొలువులో చిన్న ఉద్యోగం సంపాదించాలని ఉన్నది. వాడికి కాస్త సహాయంచేయాలి," అన్నాడు లఘుకర్ణి.

"అదెంత భాగ్యం? నేను చెబితే రాజుగారు కాదనరు," అన్నాడు పాకయాజి.

వి. శేషగిరిరావు

తరవాత లఘుకర్ణి ఏవో మంత్రాలు చదివి పాకయాజికి ఇంద్రజాల విద్య చెప్ప నారంభించాడు.

కొద్దికాలం గడిచింది. రాజుగారు పాక యాజిని తన సలహాదారుగా నియమించాడు. ఇందుకు సభికులంతా హర్షించారు.

అరోజే లఘుకర్ణి పాకయాజితో, "నా కొడుకు సంగతి ఏంచేశారు? మీరు లోగడ చేస్తూఉండిన ఉద్యోగం వాడికి ఇప్పించలేరా?" అన్నాడు.

"ఎందు కిప్పించలేనూ? రాజుగారు ఎవరినన్నా ఆ ఉద్యోగానికి మనిషిని చూపమని నన్ను అడిగారు. కాని మా మేనమామ తన కొడుక్కు ఆ ఉద్యోగం ఇప్పించకపోతే నిరశనవ్రతం పడతానని నన్ను బెదిరించాడు. అందుచేత ఆయన ఇష్టప్రకారమే చెయ్యవలిసి వచ్చింది," అన్నాడు పాకయాజి.

"మీ మేనమామ కొడుకుకు ఉద్యోగం ఇప్పించటమే సబబు! పోనివ్వండి, మా వాడికి మరొక అవకాశం ఇప్పింతురుగాని!" అన్నాడు ఐంద్రజాలికుడు.

మరికొంత కాలం గడిచింది. రాజుగారి ప్రధానమంత్రి చనిపోయాడు. రాజుగారు పాకయాజిని పిలిచి, "నా కింద ఇంకా అనేక మంత్రులున్నప్పటికీ నేను మిమ్మల్నే ప్రధానమంత్రిగా వేయదలిచాను. అందుకు



తగినవారు మరెవరూ నాకు కనిపించ లేదు," అన్నాడు.

పాకయాజి సంతోషించాడు. తాను ఇంద్రజాల విద్య నేర్చుకుంటూ ఉన్నందు వల్లనే తనకీ ఉన్నతపదవి లభించిందని ఆయన అనుకున్నాడు.

ఆరోజు లఘుకర్ణి పాకయాజితో, "మా అబ్బాయి మాటేమిటి? వాడికి మీరు ఉద్యోగం ఇప్పిస్తే అడ్డేవారులేరు!" అన్నాడు.

"అవునవును. మరొక ఉద్యోగం ఎందుకు, రాజుగారి సలహాదారుగానే వేయిస్తామనుకున్నాను. కాని మా పినతల్లి భర్త ఆ ఉద్యోగం తనకే ఇవ్వాలనీ, ఇవ్వక పోతే సన్యసించుతాననీ భీష్మించాడు. అందుచేత ఆయన కివ్వక తప్పిందికాదు!" అన్నాడు పాకయాజి.

"మీ పినతల్లి భర్త సంగతి ముందు చూడటం సబబే. కాని మంచి అవకాశం దొరికితే మా అబ్బాయినిమాత్రం మరిచి పోకండి!" అన్నాడు లఘుకర్ణి.

ఇంకా కొంతకాలం జరిగింది. తలవని తలంపుగా రాజుగారు మరణించాడు. ఆయనకు పిల్లలు లేరు. రాజ్యాభిషేకం ఎవరికి చెయ్యాలన్న సమస్య వచ్చింది. రాజోద్యోగులంతా ఏకగ్రీవంగా పాకయాజిని ఎన్నుకున్నారు.





రాజపురోహితుడు మంచి ముహూర్తం పెట్టి పాకయాజికి రాజ్యాభిషేకం చేశాడు. పాకయాజికి ఛత్రచామరాలు పట్టారు. వంది మాగధులు కైవారాలిస్తున్నారు.

ఇంతలో ఒక నౌకరు వచ్చి, "మహారాజా, ఎవరో ఇంద్రజాలికుడు తమ దర్శనార్థం వచ్చాడు. లోపలికి ప్రవేశపెట్టమన్నారా?" అని అడిగాడు.

పాకయాజికి మండిపోయింది. స్వర్గానికి వెళ్లినా వడివీకులు తప్పనట్టు తాను రాజైనా కూడా ఈ లఘుకర్ణి బెడద ఏమిటనుకున్నాడు. ఇంద్రజాలికుణ్ణి ప్రవేశపెట్టమని నౌకరుతో చెప్పాడు.

లఘుకర్ణి వచ్చి, "మహారాజా, నా కొడుకు ఉద్యోగంమాటఏమిటి?" అన్నాడు.

"నీవు ఇంద్రజాల విద్యతో మా ప్రజలను రకరకాల మోసగించుతున్నట్టు వార్త వచ్చింది. నిన్ను స్వేచ్ఛగా తిరగనివ్వటం దేశానికి ప్రమాదం!" అంటూ పాకయాజి తన భటులతో, "ఈ నీచుణ్ణి పట్టి బంధించి కారాగృహంలో ఉంచండి! వీణ్ణి కాలక్రమాన విచారిస్తాం!" అన్నాడు.

ఈ మాటలు విని లఘుకర్ణి ఏవో మంత్రాలు చదవసాగాడు. పాకయాజికి మైకం వచ్చినట్టయింది. ఆయన కళ్లు తెరిచి చూసేసరికి తాను ఇంద్రజాలికుడి ఇంట ఉన్నట్టు తెలిసిపోయింది. సింహాసనమూ, దర్బారూ, ఛత్రచామరాలూ, వందిమాగధులూ, ఏమీ లేవు.

"క్షమించండి! ఇంద్రజాల విద్యను కూడా అందరికీ దానంచెయ్యరాదు. తగిన వాళ్లకే దాన్ని ఇవ్వాలి. నేను మీకు ఆ విద్యను ఇవ్వలేను!" అన్నాడు లఘుకర్ణి.

ఇంద్రజాల విద్య లభించకపోయినా, ఇంద్రజాలం ఎలాటిదో అర్థంచేసుకున్నాడు పాకయాజి. ఆయన ఒక్క నిట్టూర్పు విడిచి లేచి, లఘుకర్ణి వద్ద సెలవుపుచ్చుకుని ఇంటికి తిరిగి వెళ్లిపోయాడు.





# "సముద్రపు గుర్రాలు"

సముద్ర జలాలలో నివసించే జంతువులన్నిటిలోకీ చాలా ఆకర్షవంతమైనవి "సముద్రపు గుర్రాలు". వీటిని మనం ప్రతి "ఆక్వేరియం"లోనూ చూడవచ్చు. పాశ్చాత్యదేశాలలో కొందరు వీటిని నీటి తొట్లలోకూడా పెంచుతారు.

సాధారణంగా మనం చూసే సముద్రపు గుర్రాలు మరుగుజ్జులు–సుమారు ఒక అంగుళం నిడివి ఉంటాయి. కాని వీటిలో కొన్ని జాతులు అయిదారంగుళాల నిడివికూడా ఉంటాయి. జపాను, ఆస్ట్రేలియాల సముద్ర జలాలలో పల్లెవాళ్లు ఒక అడుగు నిడివి గల సముద్రపు గుర్రాలనుకూడా పడతారట.

అనేక విషయాలలో ఇవి చేపలకు భిన్నంగా ఉంటాయి. వీటికి తోకలుంటాయి. అవి తమ తోకలతో సముద్రం అడుగున ఉండే మొక్కలను చుట్టి ఒకేచోట స్థావరంగా నిలబడి తమ ఆహారాన్ని సంపాయించుకుంటాయి.

అంతేగాక వీటి చర్మాలపై పొలుసులుండవు. మెడ మొదలుకొని తోక వరకూ గల శరీరభాగంలో యాభై వలయాలు, ఎముకలాటి పదార్థంతో తయారయినవి, ఉంటాయి. వీటిపై కవచపు పలకలు కప్పిఉంటాయి.

చేపలతో పోల్చితే నీటిలో ఇవి బాగా ఈదలేవనే చెప్పాలి. వీటి వీపుపైనా, పొట్ట దిగువనా రెక్కలు ఉంటాయి. వీటిని ఆడిస్తూ ఇవి ఈదుతాయి. కాని ఇవి ఒక గజం దూరం ఈదటానికి సుమారు ఐదు నిమిషాలు పడుతుందట.

సముద్రపుగుర్రాలు నీటిలో పైకి పోవటమూ, కిందికి దిగటమూ ఆక్వేరియములలో మనం చూడవచ్చు. పైకి లేవటానికివి తమ శరీరాలను సాగదీసుకుంటాయి, కిందికి దిగటానికి బాగా ముడుచుకుంటాయి.

ఇవి చాలా నిరపాయమైన జంతువులు, అర్భకపు ప్రాణులు. వీటి నోళ్లలో వాడిఅయిన పళ్లుకూడా లేవు. తమ ఆహారం సమీపంలోకి వచ్చినప్పుడవి నీటిని బలంగా నోటిలోకి లాగి, తమ ఆహారాన్ని నమలకుండానే





మింగేస్తాయి. వేగంగా కదిలే శక్తీ, ఇతర ప్రాణులతో పోరాడేశక్తీ లేని ఈ జీవులకు రక్ష ఏమిటి?

"చర్మపు అస్థిపంజరం" గల వాటి శరీరాలు ఇతర ప్రాణులకు రుచికరంగా ఉండకపోవచ్చు. అది అలా ఉంచి, అవి తమ పరిసరాలకు అనుగుణమైన శరీరవర్ణం కలిగిఉంటాయి. ఇందువల్ల వీటికి కొంత రక్షణ ఉన్నది.

సముద్రపు గుర్రాలలో పచ్చవీ, ఆకు పచ్చవీ, గోధుమ రంగువీ, తెల్లవీ, ఎర్రవీ, బూడిదరంగువీ, వంగపండు చాయవీకూడా కనిపిస్తాయి.

వీటిని సముద్రంలోనుంచి తీసి నీటి తొట్టెలలో పెట్టినాక వీటి రంగులు "మాసిపోతాయి."

మరొక చిత్రమేమంటే సముద్రపు గుర్రం తన నెత్తిన చిన్న దుబ్బులాటిది సృష్టించగలదు.

దాని సహాయంతో అది సముద్రం అడుగున ఉండే మొక్కల మధ్య ఇతర ప్రాణులకు కానరాకుండా దాగి ఉండగలదు.

సముద్రపు గుర్రాల పుట్టుక అతి విచిత్రమైనది. అవి తల్లి గర్భాన కాక, తండ్రి గర్భాన జన్మిస్తాయి! ఆడ సము



ద్రపుగుర్రం మగదాని పొట్టలో ఉండే తిత్తిలో గుడ్లను పెట్టేస్తుంది. గుడ్లను పెట్టినాక తిత్తి గట్టిగా మూసుకు పోతుంది. పది రోజులకల్లా తండ్రి "గర్భం"లో ఈ గుడ్లు పిల్లలవుతాయి.

అప్పుడు మగ సముద్రపు గుర్రానికి "నొప్పులు" అరంభమవుతాయి. అది ప్రసవవేదన పడుతూ ఒక్కొక్క పిల్లనే ప్రసవిస్తుంది. ఒక్క ప్రసూతిలో అది 10 మొదలు 35 పిల్లలదాకా కన వచ్చు. పిల్లలన్నీ బయటికి రాగానే తండ్రికి ప్రసవవేదన నిలిచిపోతుంది, దాని తిత్తి మళ్ళీ ఎప్పటిలా మూసు కుంటుంది. అప్పుడు పుట్టిన పిల్లలు పురు గులలాగా గిలగిల లాడుతూ నీటి అడు గుకు పడిపోతాయి. కాని కొద్ది క్షణాల లోనే అవి నిలువుగా ఈదుతూ, తోకలను దేనికైనా చుట్టటానికి యత్నిస్తూ, చుట్టూ కలయజూస్తూ తమ జీవితం ఆరంభిస్తాయి.

ఊసరవెల్లిలాగే సముద్రపు గుర్రం కూడా తన కళ్లను వేరువేరు దిక్కు లకు తిప్పి, ఒకేసారి రెండు వేపుల చూడగలదు.



# 1. నేషనల్ ఫిజికల్ లెబారెటరీ - న్యూఢిల్లీ



ఈ సంస్థను స్థాపించాలన్న నిర్ణయం 1943 లో జరిగింది. 1947 జనవరి 4 న భారత ప్రధాని దీనికి శంకుస్థాపన చేశారు. 1950 జనవరి 21 న సర్దార్ వల్లభభాయి పటేల్ ఈ సంస్థకు ప్రారంభోత్సవం జరిపారు. ఈ సంస్థను నిర్వహిస్తున్నవారు డా. కే. ఎస్. కృష్ణన్, ఎఫ్. ఆర్. ఎస్.

ఈ సంస్థ కింద 70 ఎకరాల ఆవరణ ఉన్నది. దీని భవనం ఆధునిక కట్టడం. ఎయిర్ కండిషనింగ్ మొదలైన అనేక సౌకర్యాలతో కూడిఉన్నది.

ఈ సంస్థలో ఈ కింది విషయాలను గురించి పరిశోధనలు జరుగుతాయి: మానాల నిర్ణయం, పారిశ్రామిక ప్రమాణాలు, పారిశ్రామిక ముడిదినుసులు, తయారీ వస్తువుల నాణ్యాలు మొదలైనవి.

ఈ సంస్థలో అనేక రకాల యంత్రాలు తయారు చేయబడ్డాయి. వీటిలో ఒకటి సూర్యుడి వేడితో వంటచేసే యంత్రం.



# తప్పించుకుపోయిన కోడి

ఒకనాడు ఒక నక్క రహస్యంగా ఒక కాపు ఆవరణలో జొరబడి ఒక కోడి పుంజును నోటకరుచుకుని పారిపోసాగింది.

ఈ సంగతి చూసి కాపు నలుగురినీ కేకపెట్టాడు. అందరూ కలిసి నక్కను తరమసాగారు.

ఈలోపల కోడిపుంజు తన ప్రాణాలు కాపాడుకోవటానికి ఒక ఉపాయం ఆలోచించింది. అది నక్కతో, "నక్కబావా, వాళ్లు మూర్ఖులు! నిన్ను తరుము తున్నారేగాని ఎన్నటికీ పట్టుకోలేరు!" అన్నది.

ఈ మాటలు విని నక్క చాలా గర్వపడింది. కోడిపుంజు మళ్లీ ఇలా అన్నది: "వాళ్లు వెంటబడి వస్తుంటే నాకే నామోషీగా ఉన్నది. నువు వెనక్కు తిరిగి, 'మీరంతా వెళ్లిపొండి! ఇది నా పుంజు!' అని చెప్పెయ్యరాదూ?"

నక్కకు ఈ సలహా నచ్చింది. అది తన నోట ఉన్న పుంజును విడిచిపెట్టి, తనను తరుముకు వచ్చేవాళ్లతో కోడిపుంజు చెప్పినట్టే చెప్పింది.

ఈలోపల కోడిపుంజు తప్పించుకుని పారిపోయింది.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1959 జూలై సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మే నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : తురంగముపై స్వారి

రెండవ ఫోటో : కురంగముతో నారి

పంపినవారు : పి. శేషగిరిరావు,

C/o. పి. భావనారాయణగారు, B 1/46, పట్టాభిపురం న్యూ కాలనీ, గుంటూరు.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు మామిడితోటలో బంతి ఆట ఆడుకుంటూ వుండగా తోటలో పనిచేసుకుంటున్న కాపలావాడు, వాళ్ల దగ్గరకు వచ్చి బంతి లాక్కుని విసిరి కాలవలోకి గిరవాటువేసి, వాళ్లను తోటనుంచి బయటికి వెళ్లమన్నాడు. ఇది చూసిన 'టైగర్' చెట్టుకింద వదిలివున్న కాపలావాడి చెప్పులు నోటకరుచుకుని కాలవకేసి పరిగెత్తసాగింది. కాపలావాడు దానివెంట పడ్డాడు. కాని, యీలోపలే 'టైగర్' ఆ చెప్పులను కాలవలో పడవేసి అవతలిగట్టుకు యీదుకుపోయింది. ఎంత వెతికినా కాపలావాడికి కాలవలో చెప్పులు దొరకలేదు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'



# విచిత్ర భూభాగ సందర్శనం

రమణీయమైన కంగ్రా జిల్లా తూర్పు పంజాబు రాష్ట్రంలో వుంది. ఈ జిల్లాలో మిన్ను ముట్టుతున్న హిమాలయా పర్వతాల ఒడిలో ఒక ప్రశాంతమైన ప్రదేశం వుంది. అదే కులూ లోయ.

కులూ లోయ అంటే ఏమిటో తెలుసా? వృక్షమయమైన కొండలు, గలగలమని పారే సెలయేళ్లు, వింత గొల్పే అడవి మృగాలు, గుత్తులు గుత్తులుగా వ్రేలాడే పండ్ల తోటలతో తులతూగుతూ కనుల పండువుగా వుంటుంది. ఇక్కడ నివసించేవారిలో చాలామంది దృఢకాయులు, గులాబీని పోలిన శరీర చ్ఛాయగల కొండజాతివారు. వీరి ఆడవారు ధరించే బరువైన ఆభరణాలు, రంగు రంగుల దుస్తులు పేరుపొందినవి. ఇక్కడి ప్రజలలో చాలా మంది ఆపిల్సు, అప్రికాట్సు, పీచస్ వంటి పండ్లను బంగాళా దుంపలు, మొక్కజొన్నలను పండిస్తే మరికొందరు ఉన్నికోసం గొర్రెలను పెంచుతారు. పంటలో కొంత స్వంతానికి వుంచుకొని, మిగతాది అమ్ముకుంటారు. నిస్సందేహంగా, ఎంత కష్టపడందీ యిలా పండించగలరు! ఓ కప్పు వేడి వేడి టీతో మొదలైయే వీరి పని మరో కప్పు వేడి టీతో పూర్తవుతోంది. వీరికి బ్రూక్ బాండ్ టీ అంటే అత్యంత ప్రీతి. అవును మరి, దేశంలో అన్నిచోట్ల లాగే యీ లోయ ప్రజలకుకూడ ఎల్లప్పుడూ తాజాగా లభించే బ్రూక్ బాండ్ టీ అంటే యింతా అంతా యిష్టంకాదు.

ఎంతో నివాస యోగ్యమైన యీ కులూ లోయ ప్రకృతి సౌందర్యానికి తోడు, శీతోష్ణస్థితికూడా చాలా ఆరోగ్యవంతమైంది. శీతాకాలంలో బాగా మంచు పడ్డప్పుడు తెల్లని తివాసీ కప్పినట్లు యీ లోయ చాలా విచిత్రంగా కనిపిస్తుంది. నిజం చెప్పాలంటే చల్లని, పరిశుభ్రమైన కొండగాలి యిక్కడి ప్రజల ఆరోగ్యం కాపాడితే, బ్రూక్ బాండ్ టీ వారి అలసట తీర్చి ఉత్సాహాన్ని, ఉల్లాసాన్ని చేకూరుస్తోంది.

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్.

BB.295

Photo by J. C. Mehta



బహుమతి
పొందిన వ్యాఖ్య

కురంగముతో నారి

పంపినవారు :
ఏ. శేషగిరిరావు - గుంటూరు

